# Remnants of Buddhist Heritage







భువనేశ్వర్ సమీప దయానదీ తీరాన క్రీ.పూ. 3వ శతాబ్దంలో జరిగిన కళింగయుద్ధ రక్తపాతాన్ని చూసి, 'చండశోకుడైన' మౌర్యచక్రవర్తి అశోకుడు 'ధర్మశోకుడు'గా మార్పుచెందాడు. బౌద్ధమతం స్వీకరించాడు. ఒరిస్సాలోనేగాక, దేశమంతటా; చైనా, జపాను, శ్రీలంక వంటి ఇతరదేశాలలోనూ బౌద్ధమతం వ్యాప్తిచెంద డానికి అదే కారణమయింది. అశోకచక్రవర్తిలో వచ్చిన ఈ మానసిక పరివర్తనకు--భువనేశ్వర్‌కు 8 కి.మీ. దూరంలో ధౌలీలో ఉన్న శిలాశాసనాలు ఈనాటికీ మౌన సాక్ష్యాలుగా నిలిచి ఉన్నాయి. ఆ సంఘటనకు స్మృతి చిహ్నంగా ఇండియా-జపాను దేశాల సహకారంతో ఇక్కడ ఒక శాంతి స్థూపం నిర్మించబడి ఉన్నది.

కటక్‌కు 70 కి.మీ. దూరంలో ఉన్న ఉదయగిరి, రత్నగిరి, లలితగిరి పర్వత సానువులలోనూ; వాటికి సమీపంలోని లంగూడీ, కోయామా కొండ ప్రాంతాలలోనూ ఇటీవల జరిపిన త్రవ్వకాలలో అత్యద్భుతమైన అవశేషాలు వెలుగులోకి వచ్చాయి. ఈ పర్వత పరిసరప్రాంతాలలోనే ఒకప్పుడు సువిశాల బౌద్ధవిహారాలు వెలిశాయి. ఇక్కడ బయటపడిన శిథిలాలు చీనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ తన యాత్రాగ్రంథంలో ప్రస్తావించిన ఆనాటి పుష్పగిరి బౌద్ధ విశ్వవిద్యాలయ శిథిల అవశేషాలయి ఉండవచ్చు!

**Orissa**
The Soul of India





**For more information contact:** Director, Tourism; Paryatan Bhavan; Bhubaneswar-751014, Orissa, India
Tel: (0674) 432177, Fax: (0674) 430887, e-mail ortour@sancharnet.in, website www.orissa-tourism.com
Tourist Offices at: **Chennai:** Govt. of Orissa, Tourist Office, Tamilnadu Tourism Complex, Ground Floor, Near Kalaivanar Arangam, Wallajah Road, Chennai-600002, Tel: 8360891
**Calcutta:** Utkal Bhawan, 55, Lenin Sarani, Pin-700013, Tel: (033) 2443653
**New Delhi:** Utkalika, B/4 Baba Kharak Singh Marg, Pin - 110001, Telefax (011) 3364580




NATURATA

A 

ACTIVE

B  

BUZZ BOSS

C

CADET DX

D 

DEVIL DX

E 

ELEPHANT

F 

FISH

G 

GIRAFFE

H 

HEN

I 

INSECT

J 

JOKER

K 

KIDD DX

L 

LI'L ANGEL

LAMBADA LIMBO

M 

MISSILE MISS INDIA Jr

N 

NEST

O 

ORANGE

P 

PIRANHA

Q 

QUEEN Jr

R 

ROBO COP

S  

SPARKY SALSA

T

TERMINATOR




V W

**The largest range of kids bikes**

**HERO CYCLES**

THE ABC OF CYCLING

HTA 5979 2001

ఈ నెల విశేషాలు సంపుటి 105 నవంబర్2001 సంచిక 5



భారత సంస్కృతి-చరిత్ర 47



విశ్వసేనుడి దిగ్భ్రాంతి (బే.క) 19



యక్షపర్వతం 11



మాయావేణువు 38





**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of***
***Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.**120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్: 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :**98203-02880**
ఫోన్: 022-266 1599/266 1946/
265 3057

వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# నవ్వే పువ్వుల ప్రత్యేక సంచిక!

నవంబర్ అనగానే మనకు గుర్తుకువచ్చేది బాలలదినోత్సవం. మన తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినమైన నవంబర్ 14వ తేదీన బాలలదినోత్సవం జరుపుకుంటున్నాము.

అయితే, ఇది ఆచరణలోకి రాకముందే అంటే 1954 లో ఐక్యరాజ్యసమితి సాధారణసభ-బాలల సంక్షేమ పథకాలను చేపట్టడానికి అన్నిదేశాలూ ప్రపంచవ్యాప్తంగా బాలలదినోత్సవం జరపాలని పిలుపునిచ్చింది. ఆ తరవాత 1959 నవంబర్ 20 వ తేదీ బాలల హక్కుల ప్రకటనను వెలువరించింది. ఈ ప్రకటన వెలువడిన నవంబర్ 20 వ తేదీని ప్రపంచ బాలలదినంగా జరుపుకోవాలని కూడా ఆదేశించింది. ఆవిధంగా నవంబర్–నవ్వే పువ్వులైన బాలబాలికలకు సంబంధించిన నెలగా నిలిచిపోయింది.

పిల్లలకూ, పెద్దలకూ ఆనందం కలిగించే దీపావళిపండుగ కూడా ఈనెలలోనే వస్తున్నది. అపాయకరమైన బాణాసంచా తయారీ పరిశ్రమలలో ఇకమీదట పిల్లలను పనిలోకి తీసుకోకూడదని బాణాసంచా తయారీదారుల సంస్థ నిర్ణయించింది. బాలల హక్కులకోసం కృషి చేస్తున్నవారికి ఇది కాస్త ఊరట కలిగించే వార్త!

యువపాఠకుల హృదయాలను విజ్ఞాన వినోదాలతో అలరింపచేయాలన్న లక్ష్యంతోనే చందమామ పయనిస్తున్నది. గత యేడాదిలాగే ఈ సంవత్సరంకూడా బాలరచయితల రచనలతో, బాలచిత్రకారుల చిత్రాలతో నవంబర్ చందమామ పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతున్నది.

పిల్లల పరిపూర్ణ వికాసానికి తిండి, బట్ట,నీడ, ప్రేమ, విద్య మొదలైనవాటికి హక్కులు ఉన్నట్టే, వారి సృజనాత్మక శక్తులను వ్యక్తీకరించడానికి కూడా అవకాశం కల్పించాలని చందమామ భావిస్తోంది. అలాంటి అవకాశం కల్పించడానికి చేసిన ప్రయత్నఫలితమే ఈ చందమామ నవంబర్ సంచిక. పిల్లలు తమ ప్రతిభను వ్యక్తీకరించడానికి ఉపకరించిన ఒక వేదికగా ఇది పాఠకుల ఆదరాభిమానాలను చూరగొనగలదని విశ్వసిస్తున్నాము!



సంపాదకుడు : విశ్వం

# హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

## హీరోస్ ఆఫ్ ఇండియా - 2

మీకు క్రీడలంటే చాలా ఇష్టం, అవునా? అందుకే మీకోసం మీ అభిమాన భారత క్రీడాకారుల గురించిన ఈ క్విజ్!

**అన్నీ సరైన సమాధానాలుగల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!★**

1. ఆయన 1932 లో లాస్ ఏంజెలెస్‌లో జరిగిన ఒలింపిక్స్‌లో భారత హాకీజట్టుకు నాయకత్వం వహించి, ఒలింపిక్ గోల్డ్ సాధించేలా చేశాడు. 1926-'48 మధ్య జరిగిన అంతర్జాతీయ క్రీడాపోటీలలో ఆయన వెయ్యికి పైగా గోల్స్ స్కోర్ చేసినట్టు చెబుతారు. ఆయన ఎవరు?

..............................................

2. ఒకప్పుడు ఆయన జూనియర్ వింబుల్డన్ ఛాంపియన్. ఈనాడు ఆయన మనదేశంలో మెచ్చదగిన 'టెన్నిస్ ద్వయం' ఆటగాళ్ళలో ఒకడు. ఆయన ఎవరు?

..............................................

3. 10,000 రన్స్‌కుపైగా స్కోర్‌చేసిన తొలి బ్యాట్స్‌మేన్ లిటిల్‌మాస్టర్ ఎవరు?

..............................................

4. ఆయనచెస్ (చదరంగం)లో వరల్డ్‌ఛాంపియన్. ఇవాళ ప్రతి భారతీయుడికీ ఆయన్ను గురించి తెలుసు. మీకూ తప్పక తెలిసే ఉంటుంది. ఎవరాయన?

..............................................

5. ఆయన 1980 లో ఆల్ ఇంగ్లాండ్ బ్యాడ్మింటన్ ఛాంపియన్‌షిప్ సాధించి భారత్‌కు వరల్డ్ బ్యాడ్మింటన్ మ్యాప్‌లో స్థానం కల్పించాడు. వరుసగా తొమ్మిది సంవత్సరాలు నేషనల్ బ్యాడ్మింటన్ ఛాంపియన్‌గా ఉన్నాడు. ఆయన ఎవరో మీకు తెలుసా?

..............................................

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపిన చోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన హీరో ఎవరు? ఎందుకు అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

క్రీడలలో నా అభిమాన హీరో:..............................................

..............................................

..............................................

పాల్గొనేవారి పేరు: ..............................................

వయసు:.............తరగతి: ..............................

చిరునామా:..............................................

..............................................

పిన్: ......................... ఫోన్: .........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2001 డిసెంబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

**హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-2**
**చందమామ ఇండియా లిమిటెడ్**
**82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ**
**ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.**

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ★ ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్టయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు





# కాలం విలువ

దీక్షితులు ఆ ఊరిలో పేరుగాంచినవైద్యుడు. చాలా తెలివైనవాడనీ, వైద్యం చేయడంలో ఆరితేరిన వాడనీ అందరూ అంటూంటారు. ఇరుగు పొరుగు గ్రామాల నుంచి కూడా రోగులు చికిత్సకోసం ఆయన దగ్గరకు వస్తూ ఉంటారు. ఒక రోజు ఆ ఊళ్ళోని కన్నయ్య అనే వడ్డీ వ్యాపారి ఆయన్ను చూడడానికి వెళ్ళాడు.

ఏవో మాత్రలు పొట్లాలు కడుతున్న దీక్షితులు, కన్నయ్యను చూస్తూనే, "కూర్చోండి! ఒక్క నిముషం," అంటూ మందు పొట్లాలను బల్ల సొరుగులో భద్రపరచి, "ఆ, ఇప్పుడు చెప్పండి!" అన్నాడు.

ఆ మరుక్షణం, "అయ్యా, కుంటివాణ్ణి నడవలేను. రెండుకళ్ళూ లేవు. చూడలేను. పుణ్యం ఉంటుంది. ఏదైనా ధర్మం చేయండి, బాబయ్యా!" అంటూ బయట నుంచి బిచ్చగాడొకడు అడిగాడు.

దీక్షితులు వెళ్ళిపో అన్నట్లు సైగచేశాడు. వాడు వెళ్ళిపోయాడు.

కన్నయ్య ఏదో చెప్పేందుకు గొంతు సవరించుకుంటూండగా, మళ్ళీ బయటి నుంచి బిచ్చగాడొకడు, "అయ్యా, ముసలి వాణ్ణి. ఏపనీ చేయలేను. ఇంత ధర్మంచేసి పుణ్యం కట్టుకోండి, బాబూ!" అంటూ కేక పెట్టాడు.

దీక్షితులు కాస్త కటువుగా, "ఏమీ లేదు పో!" అనగానే, ఆ ముసలివాడు వెళ్ళిపోయాడు.

అప్పుడు కన్నయ్య, "దీక్షితులు గారూ! నేనొచ్చిన పనేమంటే..." అని మొదలుపెట్టబోతూండగా, బయట ఒక భయంకరమైన డోలు శబ్దం వినిపించింది.

ఒక బాగా బలిసినవాడు ముఖానికి రంగులు పూసుకుని, కొరడాతో వంటిపై చరుచుకుంటూండగా, అతడి పక్కన వున్న స్త్రీ, రెండు పుల్లలతో డోలునొకదాన్ని కిర్రూ

కోలపల్లి ఈశ్వర్



క్రూరా అనిపిస్తూ, ఆగకుండా వాయిస్తున్నది. వాళ్ళను చూస్తూనే దీక్షితులు చప్పున లేచి గబగబావెళ్ళి, జేబులోవున్న రూపాయి నాణేన్ని తీసి ఆ స్త్రీకిచ్చాడు. వెంటనే వాళ్ళు అక్కడినుంచి వెళ్ళిపోయారు. దీక్షితులు తిరిగి వచ్చి తన కుర్చీలో కూర్చుంటూ, "సరి, ఇప్పుడు చెప్పండి, కన్నయ్యగారూ!" అన్నాడు.

ఈ జరిగినదానికి కన్నయ్య ఆశ్చర్య పోతూ, "అయ్యా! ఒక చిన్న సందేహం," అన్నాడు.

"సందేహం అంటే సందేహమే! వాటిల్లో చిన్నాపెద్దా అంటూ వుండవు. సరే, చెప్పండి, కన్నయ్యగారూ!" అంటూ దీక్షితులు చిన్నగా నవ్వాడు.

"మీరు ముందు వచ్చిన ఇద్దరు బిచ్చ గాళ్ళకూ డబ్బులు వేయకుండా, వచ్చీరాగానే ఆ కొరడా, డోలూవాళ్ళకు రూపాయి దానం చేసి వచ్చారు. ముందు వచ్చిన కుంటివాడూ, ముసలివాడూ అశక్తులు, బక్కచిక్కి వున్న వాళ్ళు. వీళ్ళేమో కాలూ చేయీ బాగానే వుండి, దాఎద్దుల్లా వున్నారు. అవసరంలో వున్నవాళ్ళను వదిలి, అర్హత లేనివాళ్ళకు బిచ్చం వేయడంలో, మీ ఆంతర్యం ఏమిటో సెలవిస్తారా?" అని అడిగాడు కన్నయ్య.

"మంచి ప్రశ్నే అడిగారు, కన్నయ్యగారూ! అసలు బిచ్చం వేయడమే అనవసరం. ఇప్పుడు నేనెవరికీ బిచ్చం వేయనే లేదు. ఇకపోతే, కుంటివాడూ, ముసలివాడూ నేను బిచ్చం వేయకపోతే చచ్చిపోయేంత దీన

స్థితిలో లేరు. మరి కాస్తముందుకు వెళ్ళి వేరే ఎవరినైనా అడుక్కుంటారు. చివరగా వచ్చిన డోలువాళ్ళకు నే వేసింది బిచ్చం కానేకాదు,'' అన్నాడు దీక్షితులు.

''మరి, దాన్నేమంటారు?'' అన్నాడు కన్నయ్య.

''వినండి! ఆఖరుగా వచ్చిన ఇద్దరూ మొండి బిచ్చగాళ్ళు. అలా మనం వినలేని విధంగా వుండే సంగీతాన్ని మోగిస్తూ, చూడలేని విధంగా కొరడాతో కొట్టుకున్నట్టు చేస్తారు. డబ్బు ఇవ్వకపోతే కనీసం ఒక పావుగంట ఇబ్బంది పెడతారు. చివరకు అసభ్య పదాలతో మన తలవాచిపోయేలా తిడుతూ వెళ్తారు. అందుకే, వాళ్ళు రాగానే వెళ్ళి రూపాయి వాళ్ళ మొహాన కొట్టి ఒక పావు గంట కాలాన్నీ, మనశ్శాంతినీ కాపాడుకున్నాను,'' అని వివరించాడు దీక్షితులు.

వెంటనే కన్నయ్యకు ఏదో స్ఫురించి, తనజేబులు వెదికి ఒకరూపాయి బిళ్ళను బయటికి తీసి, దీక్షితులు ముందుంచి, ''నా ప్రశ్నకు జవాబు ఇచ్చేందుకు, మీ విలువైన కాలాన్ని వాడారుకదా!'' అన్నాడు వినయంగా.

దీక్షితులు రూపాయిని తీసుకోకుండా కన్నయ్య ముందుకు తోస్తూ నవ్వి, ''చూడండి, కన్నయ్యగారూ, మీరు పొరబడ్డారు. నేను కొనుక్కున్నది బిచ్చగాడి కాలాన్ని. వాడు పావు గంటసేపు గింజుకున్నాక, చివరకు నేను ఒక రూపాయి కంటే ఎక్కువ ఇవ్వను; కాబట్టి రూపాయే ఖర్చు పెట్టాను. కానీ మీరు కొన్నది వైద్యం చేయడంలో ఆరితేరిన వాడని పేరుగాంచిన వైద్యుడినైన నా కాలాన్ని! కాబట్టి రూపాయి సరిపోదు. దాని ఖరీదు ఎంతో మీరొచ్చిన పని చెప్పాక నిర్ణయించి మీవద్ద తీసుకుంటాను,'' అన్నాడు.

అప్పుడు కన్నయ్య తను వచ్చిన పనేమిటో మరిచిపోయినవాడిలా, దీక్షితుల కేసి క్షణకాలం చూసి, వేళ్ళతో నుదురు రుద్దుకోసాగాడు.

దీక్షితులు పెద్దగా నవ్వి, ''మీరు వచ్చింది మతిమరుపుకు మందుకోసం, అవునా?'' అని ప్రశ్నించాడు. కన్నయ్య సంతోషంగా, ''హా, బాగా గుర్తుచేశారు, దీక్షితులుగారూ! ఈమధ్య కొంత కాలంగా నాకు మతిమరుపు ఎక్కువైంది,'' అన్నాడు.



ORISSA
*The soul of India*

మీకు ఒక క్విజ్

# పూరీ!

**December 1-5, 2001 Konark Festival**

పూరీ పట్టణం పర్యాటకులకు విభిన్నమైన ఆకర్షణలను కలిగి ఉంది. మీరు మత సంబంధమైన విషయాలపట్ల ఆసక్తిగలవారయినట్టయితే జగన్నాథ ఆలయాన్ని తప్పక దర్శించాల్సిందే. మీకు సముద్రతీరం అంటే ఇష్టమా? గోల్డన్ బీచ్‌ని మిస్‌కాకండి. మీరు ఆహార ప్రియులా? మీ కోసమే ఉంది పూరీ ఫుడ్ మార్కెట్!

మనదేశంలోని చాలా అందమైన సముద్రతీరాలలో ముఖ్యమైనది పూరీ సముద్రతీరం. ఈదడానికీ, సర్ఫింగ్‌కూ ఇది అనుకూలమైన స్థలం.

దేవాలయాలకు ప్రసిద్ధిగాంచిన పట్టణం పూరీ. ప్రత్యేకంగా సుందరమైన జగన్నాథ దేవాలయం గురించి ఇక్కడ చెప్పుకోవాలి. ఇది 12 వ శతాబ్దంలో నిర్మించ బడింది. 65 మీ. ఎత్తయిన శఙ్ఖాకార గోపురం దీని విశిష్ట ఆకర్షణలలో ఒకటి. నీలాచల పర్వతం మీద నిర్మించ బడి వున్న ఈ దేవాలయం సుప్రసిద్ధ విష్ణుక్షేత్రం.

ఆలయ ప్రవేశద్వారాన్ని అలంకరిస్తున్న 8 మీ. ఎత్తయిన అందమైన సూర్యస్తంభం, ఒకప్పుడు కోణార్క సూర్యదేవాలయంలో ఉండేది.

ఏటా జరిగే రథోత్సవం; ప్రపంచంలోనే అతి పెద్దదైన ఆనందబజార్ ఫుడ్ మార్కెట్ - జగన్నాథ మందిరం రెండు ప్రధాన అంశాలు. ఈ దేవాలయం దాదాపు 20,000 మందికి జీవనోపాధిని కల్పిస్తోంది.

వివిధ వస్తువులను కొనాలనుకునేవారికి ఆసక్తిని రేకెత్తించి, ఆనందం కలిగించే పట్టణం పూరీ. మినియేచర్ రాతిశిల్పాలు, కొయ్యబొమ్మలు, గవ్వలతో తయారుచేసిన అందమైన వస్తువులు, బట్టల మీద నేసే 'పట్టా' చిత్రాలు, అప్లిక్ వర్క్ నిండిన వస్తువులు ఇక్కడివారి హస్తకళా నైపుణ్యాన్ని వేనోళ్ళ చాటుతున్నాయి.

**ఇక్కడికి చేరుకోవడం ఎలా?** భువనేశ్వర్‌కు 60 కి.మీ; కోణార్క నుంచి 35 కి.మీ. దూరంలో పూరీ పట్టణం ఉంది. రోడ్డుమార్గం గుండా ఇక్కడికి చేరుకోవచ్చు.

---

## మీకు ఒక క్విజ్

14- ఏళ్ళ లోపు పిల్లలకు
పోటీ - 3

1. రథయాత్రలో జగన్నాథుడితోపాటు ఊరేగే చెల్లెలు, అన్నయ్య పేర్లేమిటో మీకు తెలుసా?

..................................................................

2. రథయాత్ర సమయంలో, విగ్రహాలను ఒక వారంపాటు ఉంచడానికి 2 కి.మీ. దూరంలో ఉన్న చిన్న ఆలయానికి తీసుకువెళతారు. ఆ దేవాలయం పేరేమిటి?

..................................................................

3. ప్రత్యేకంగా 64 మంది యోగినులకోసం భారతదేశంలో నిర్మించబడిన నాలుగు దేవాలయాలలో ఒకటి ఒరిస్సాలో ఎక్కడ ఉందో మీకు తెలుసా?

..................................................................

మీ సమాధానాలను చుక్కలతో చూపినచోట స్పష్టంగా రాసి, కూపన్‌ను నింపి ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited**
**No.82, Defence Officers Colony**
**Ekkatuthangal, Chennai - 600 097.**

పేరు :..............................................
వయసు :..............................................
చిరునామా :..............................................
..............................................
పిన్ ........................ ఫోన్ ...........




Winners picked by Orissa Tourism in each contest will be eligible for **3-days, 2-night** stay at any of the **OTDC Panthanivas**, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar - 751 014. Ph : (0674) 432177, Fax : (0674) 430887, e-mail : ortour@sancharnet.in. Website : Orissa-tourism.com




## 11

[కొండకోటవద్ద వీరపుర ఆశ్వికులచేత ఓడింపబడిన స్వర్ణాచారి, కొద్దిమంది ఉష్ట్రయోధులతో అరణ్యంలోకి పారిపోయాడు. అక్కడ అతడికి ఖడ్గజీవదత్తులూ, సమరబాహులా కనిపించారు. గురుభల్లూకుడు తన శిష్యుల గురుభక్తిని రుజువుచేసేందుకు, వాళ్ళల్లో ఒకణ్ణి చెట్టుమీది నుంచి కిందికి దూకమన్నాడు. గురుభల్లూకుడి మాట ముగియకముందే వాడి శిష్యుడొకడు పరుగు పరుగున పోయి,దాపుల గల ఎత్తైన చెట్టుపైకెక్కి కిందికి దూకాడు. — తరవాత]

గురుభల్లూకుడి శిష్యుడు నూరడుగుల ఎత్తున్న చెట్టుమీదినుంచి దూకటం చూస్తూనే జీవదత్తుడు పరిగెత్తుకుంటూ పోయి, వాడింకా నేలకు పదీ పన్నెండడుగుల దూరంలో వుండగా, తన దండం అడ్డు పెట్టాడు. ఎలుగ్గొడ్డు వాడు తన గురువు పేరును స్మరిస్తూ, వేగంగా వచ్చి దానిమీద పడగానే, జీవదత్తుడు వాణ్ణి ఒడుపుగా పట్టుకుని భూమిమీద నిలబెట్టాడు.

ఎలుగ్గొడ్డువాడు తన గురుభక్తిని రుజువు చేసుకునే అవకాశం పోయినందుకు ఎంతగానో దిగులు పడిపోతూ, "మీరు నన్ను నేల తాకి ప్రాణం పోకుండా కాపాడారేమోగాని, నేను చచ్చి స్వర్గంచేరే అవకాశాన్ని చెడగొట్టారు!" అన్నాడు.

ఆ మాటలకు జీవదత్తుడు నవ్వి, "ఒరే, నువ్వు స్వర్గం చేరేవాడివో లేక నరకానికి పోయేవాడివో ఎవరు చూశారు? ఎలాగో చావు తప్పించుకుని బతికి బయటపడ్డావు. ఇప్పుడు నువ్వు, నీ గురువుకూ, అతడిద్వారా సమరబాహుకూ చేయవలసిన సాయం చాలా వుంది," అన్నాడు.

ఆ సరికి అక్కడికి గురుభల్లూకుడూ, సమరబాహులా, ఖడ్గవర్మా వచ్చారు. గురు



భల్లూకుడు ఆనందం పట్టలేక ఖడ్గజీవ దత్తులతో, "అయ్యలారా, నా శిష్యుల గురు భక్తి ఎలాంటిదో స్వయంగా చూశారు గదా?" అన్నాడు.

"అవును, తిరుగులేని గురుభక్తి! వీడూ, నీ శిష్యుల్లో మరొకడూ కలిసి, నే చెప్పబోయే కార్యం సాధించుకు రావాలి," అన్నాడు జీవ దత్తుడు.

గురుభల్లూకుడు మరొక శిష్యుణ్ణి దగ్గరకు పిలిచాడు. అప్పుడు జీవదత్తుడు వాళ్ళతో, "చుట్టుపక్కల ఎక్కడో వీరపుర అశ్వికులు వుంటారు. మీరు అజాగ్రత్తవల్ల దొరికి పోయినట్టు నటించి వాళ్ళను కలుసుకోవాలి. తరవాత వాళ్ళతో—కొండకోటనుంచి పారి పోయిన సమరబాహు అనుచరులందరూ, మీ గురువుదైన బిలదుర్గంలో దాక్కుని వున్నట్టు నమ్మబలకాలి. అర్థమైందా?" అన్నాడు.

"అయ్యా, అర్థమైంది. ఇది గురుకార్యం, రాచకార్యంకూడా! మీరు చెప్పినవిధంగా చేసి పని నెరవేర్చుతాం," అన్నారు భల్లూకుడి శిష్యులిద్దరూ.

తర్వాత వాళ్ళు అక్కణ్ణించి బయల్దేరి, అరణ్యంలో చాలాసేపు తిరిగి, సూర్యుడు పడమటి దిక్కుకు వాలుతున్న సమయంలో, ఒకచెట్టుకింద వీరపుర అశ్వికుల్ని చూశారు. వెంటనే శిష్యులిద్దరూ ఒక్క క్షణకాలం సంప్ర తించుకుని పెద్దగా గొంతులెత్తి, "గురుభ ల్లూకా, తమరెక్కడ? మేం ఇక్కడున్నాం!" అంటూ నాలుగైదుసార్లు గట్టిగా కేకలు వేశారు.

ఆ కేకలు విని వీరపుర అశ్వికులు అదిరి పడ్డారు. వాళ్ళ దళనాయకుడు చప్పున కత్తి దూసి, తన అనుచరులతో, "ఎవరా కేకలు పెట్టేది? మనం ఆ మధ్య విన్న ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళలా వున్నారు. మన ప్రాణాలకు ఇదొక కొత్త బెడద! రండి," అంటూ గుర్రం ఎక్కి భల్లూకుడి శిష్యులున్న వైపుకు పరి గెత్తించాడు.

అశ్వికుల్ని చూస్తూనే భల్లూకుడి శిష్యులు ఈటెలను కిందపడవేసి, "అయ్యా, మమ్మల్ని చంపకండి, లొంగిపోతున్నాం. మా గురువును శత్రువులు పట్టుకున్నట్టున్నది. ఇంక మేం ఎవరికోసం బతకటం!" అన్నారు.

దానికి దళనాయకుడు ఆశ్చర్యపడిపోతూ, "మీ గురువును శత్రువులు పట్టుకున్నారా? ఎప్పుడు పట్టుకున్నారు? ఎవరా శత్రువులు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు భల్లూకుడి శిష్యుల్లో ఒకడు, ''అయ్యా, ఈ ఉదయం, ఒంటెలమీద స్వారీచేసేవాళ్ళు హఠాత్తుగా వచ్చి మా బిల దుర్గంలో జొరబడ్డారు. ఆ సమయంలో అందరం దేవీపూజలో ఉన్నందున, వాళ్ళను ఎదిరించి పోరాడలేకపోయాం. ఆ దుర్మా ర్గులు చంపగా మిగిలినవాళ్ళం, మా గురువుతోపాటు అరణ్యంలోకి పారిపోయి వచ్చాం,'' అన్నాడు.

దళనాయకుడు ఇద్దరు అశ్వికుల్ని కొండ కోటకు పొమ్మని ఆజ్ఞాపించి, ''శత్రువులు ఈ ప్రాంతాల ఉన్న బిలదుర్గంలో ఉన్నారని చెప్పండి!''అని, భల్లూకుడి శిష్యులతో,''మీరు మా శత్రువులెక్కడ ఉన్నదీ చెప్పి మాకు చాలా గొప్పసాయం చేశారు. సేనాని రాగానే మీకు తగిన బహుమతి ఇప్పిస్తాను,'' అన్నాడు.

భల్లూకుడి శిష్యులు అయిష్టంగా తల లాడించి, ''దేవీ ఉపాసకులమైన మాకు, మీ బహుమతులెందుకు! సెలవు, వస్తాం!'' అంటూ బయలుదేరారు.

దళనాయకుడు, వాళ్ళకేసి కోపంగా చూసి, ''ఆగండి! ఆ బిలదుర్గాన్ని చూపించే బాధ్యత మీది, తెలిసిందా? మీరీ చెట్టుకిందే నిల బడండి,'' అని ఆజ్ఞాపించాడు.

ఈ లోపల దళనాయకుడు పంపిన ఇద్దరు అశ్వికులూ, సేనానికి ఒంటెలవాళ్ళు ఒకానొక బిలదుర్గంలో దాక్కుని ఉన్నారని చెప్పగానే, సేనాని ఎక్కడలేని ఆనందంతో, ''ఆ రాజ ద్రోహులందరూ కట్టకట్టుకుని ఒకేచోట వున్నారన్నమాట!''అని,కొందరు అశ్వికుల్నీ, కాల్బల సైనికులనూ వెంటబెట్టుకుని ఉత్సా హంతో దళనాయకుడున్న చోటుకు వచ్చాడు.



దళనాయకుడు, సేనానికి జరిగినదంతా చెప్పాడు. ఆ వెంటనే సేనాని, భల్లూకుడి శిష్యులిద్దర్నీ ముందుండి బిలదుర్గానికి దారి తీయమన్నాడు. పావుగంట కాలం గడిచీగడవక ముందే అందరూ బిలదుర్గాన్ని చేరారు.

సేనాని గుర్రం దిగి బిలదుర్గం ముందుకు పోయి, దిగువకు తొంగిచూస్తూ పెద్దగొంతుతో, ''ఒరే, నేను వీరపుర సేనానిని, పెద్దసైన్యంతో వచ్చి వున్నాను. మీరందరూ ఆయుధాలను బిలంలోనే వదిలి పైకి వచ్చి, రెండుమూడు నిమిషాల్లో లొంగిపోకపోతే, నేనే స్వయంగా బిలంలోకి దిగి మిమ్మల్ని చిత్రవధ చేస్తాను,'' అని కేకపెట్టాడు.

పావుగంట గడిచినా బిలంలోంచి ఎలాంటి జవాబూ రాలేదు. సేనాని కోపంతో పళ్ళు కొరుకుతూ, తన గుర్రపురౌతులందరినీ,

గుర్రాలను చెట్లకింద మందవేసి కాపలాపెట్టి, తన దగరకు రమ్మన్నాడు. వాళ్ళలా చేసి రాగానే, వాళ్ళతోపాటు కాల్బల సైనికుల్ని కూడా వెంటబెట్టుకుని జాగ్రత్తగా బిలంలోకి దిగుతూ, భల్లూకుడి శిష్యులను ముందు నడవమన్నాడు.

వాళ్ళంతా బిలంలోకి దిగగానే, హఠాత్తుగా పొదలచాటునుంచి నలుగురు ఎలుగ్గొడ్డు వాళ్ళు బయటికి వచ్చి, గుర్రాలకు కాపలా వున్న ఇద్దరు వీరపుర సైనికులను పట్టుకుని కాళ్ళూ చేతులూ కట్టి, దూరంగావున్న గచ్చ పొదల్లోకి విసిరివేశారు. ఆ సమయంలో అక్కడికి ఖడ్గజీవదత్తులు,సమరబాహూ, గురుభల్లూకుడితో పాటు వచ్చారు. జీవదత్తుడు, గురుభల్లూకుడితో, ''ఇప్పుడు వీరపుర సేనానిని ప్రాణాలతో ఎలా పట్టుకోవాలన్నదే గడ్డుసమస్య. బిలంలో వున్నవాళ్ళను హడలగొట్టేందుకు, దాని ద్వారందగ్గర ఎండు కట్టెలూ ఎండు పుల్లలను కాల్చి, ఆ పొగ కొంత లోపలికిపోయేలా చేద్దాం. ఆ పని నీ శిష్యులకూ, సమరబాహు అనుచరులకూ అప్పగించాను,'' అన్నాడు.

గురుభల్లూకుడు సంగతి చెప్పగానే, వాళ్ళు, ఆ చుట్టుపక్కల దొరికిన ఎండు పుల్లల్ని పోగుచేసి, బిలద్వారం అంచున వేసి నిప్పు ముట్టిస్తూండగా, జీవదత్తుడు బిలంలోకి తొంగిచూస్తూ, ''ఓ,వీరపురసేనానీ! నువ్వూ, నీ సైనికులూ ఆయుధాలను బిలంలోనే వదిలి రెండు మూడు నిమిషాల్లో బయటికి రావాలి. అలా చేయకపోయావో, బిలానికి నిప్పుపెట్టి, మరికొన్ని క్షణాల్లో మీ అందర్నీ అగ్నికి ఆహుతి చేస్తాం!'' అని కేకపెట్టాడు.

బిలదుర్గంలో శత్రువులకోసం వెతుకుతున్న వీరపురసేనానికి, పైనుంచి జీవదత్తుడు చేసిన హెచ్చరిక వినిపించింది. అతడు బిలంలోని ఎన్నిగదులు వెతికినా, ఒక్కగానొక్క మనిషైనా కనిపించలేదు. గురుభల్లూకుడి శిష్యులు తనను తేలిగ్గా మోసంచేశారని గ్రహించాడు.



ఇప్పుడేం చేయడమా అని అతడు ఆలోచి స్తున్నంతలో, పైనుంచి కాలుతున్న కట్టెలూ, భగభగమంటూ మంటలు రగులుతున్న పుల్లలూ, ఎండుటాకులూ వాళ్ళున్న ప్రాంతాన పడసాగినై. అది చూసిన సేనానికి తానెంత గడ్డుచిక్కులో పడిందీ అర్థమైంది. అతడు కత్తిని నేలమీద పడవేసి, సైనికులందరికీ ఆయుధాలు కిందపెట్టమని ఆజ్ఞ ఇచ్చి, బిలద్వారంకేసి తలెత్తి, "వీరపుర సేనానినైన నేను, నా సైనికులతోపాటు లొంగిపోతు న్నాను. ఆయుధాలు లేకుండా బిలంపైకి రాబోతున్నాను," అని కేకపెట్టాడు.

"ఖడ్గా, సేనాని అన్నమాటల్లో మోసం ఏమీ వున్నట్టు లేదు. ఇక వాళ్ళందర్నీ బిలం పైకి రమ్మందామా?" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ జవాబు చెప్పేలోపలే గురు భల్లూకుడు, "అయ్యా! రాజులూ, వాళ్ళ బంట్లూ నమ్మదగిన మనుషుల లెక్కలోకి రారు. ముందుగా నా శిష్యుల్ని పైకి రమ్మని, సంగతి తెలుసుకుందాం," అన్నాడు.

"కుటిలుడికి, కుటిలుడే సరైన ఉజ్జీ!" అంటూ జీవదత్తుడు నవ్వి, "భల్లూకా! నీ శిష్యుల్ని ముందుగా పైకి రమ్మని కేక వెయ్యి," అన్నాడు.

గురుభల్లూకుడు ఈటెను పైకెత్తి, "వృకే శ్వరీమాతకూ, జై!" అంటూ బిలద్వారం దద్దరిల్లేలా కేకపెట్టి, "ఒరే, శిష్యుల్లారా! ముందుగా మీయిద్దరూ పైకి రండి. అంత వరకూ ఆ రాజభృత్యుల్ని ఉన్నచోటనే ఆగ మనండి," అని సమరబాహుకు కనుసైగ చేసి, "ఇది, కొండకోట సమరబాహు మహా రాజుగారి ఆజ్ఞ!" అన్నాడు.



గురువు ఆజ్ఞ వింటూనే శిష్యులిద్దరూ బిలం పైకి వచ్చారు.

లోపలవున్న వీరపుర సేనానికి, తను ఒక రాజుకూ, ఇద్దరు యువ క్షత్రియయోధు లకూ, భయంకరులైన ఎలుగ్గొడ్డుముఠా వాళ్ళకూ బందీనైపోయాననన్న భయంతో ముచ్చెమటలు పోశాయి.

భల్లూకుడి శిష్యులు బిలంలో జరిగిన దంతా చెప్పారు. అప్పుడు ఖడ్గజీవదత్తులు, వీరపుసేనానిని బయటికి రావలసిందిగా ఆజ్ఞాపించారు. వీరపురసేనాని బిలంపైకి వస్తూనే ఖడ్గజీవదత్తులకు నమస్కరించ బోయేంతలో, జీవదత్తుడు అతడికి సమర బాహును చూపించి, "ఈయన ఈ ప్రాంతా లకు రాజు, ఉత్తమ చంద్రవంశస్థుడు. మీరు లొంగిపోవలసింది, ఈ మహారాజుకు!" అన్నాడు.



వీరపురసేనాని తలవంచి సమరబాహుకు నమస్కరించాడు. అంతలో సైనికులందరూ నిరాయుధులుగా బిలంపైకి వచ్చారు. సమర బాహు, స్వర్ణాచారితో, "మహామంత్రీ! ఈశత్రు వుల్ని ఎలా శిక్షిద్దామంటారు?" అని అడిగాడు.

స్వర్ణాచారి, ఖడ్గజీవదత్తులతో చిన్నగా ఏదో సంప్రతింపులుచేసి, "మహారాజా! వీళ్ళను ఎలా శిక్షించాలన్నది, వీరపురరాజు మనపట్ల అనుసరించబోయే విధానాన్నిబట్టి వుంటుంది. ముందు వీళ్ళందర్నీ మన కొండ కోట కారా గారంలో బంధిద్దాం," అన్నాడు.

"సరి, సరి, యుక్తియుక్తమైన ఆలోచన!" అన్నాడు సమరబాహు.

ఆ క్షణంవరకూ కేవలం బందిపోట్ల నాయకుడైన సమరబాహు మాటల్లోనూ, హావభావాల్లోనూ వచ్చిన రాజోచితమైన లక్ష ణాలుచూసి, ఖడ్గజీవదత్తులు ఆశ్చర్య పోయారు. "చిన్న విజయం, పిసరంత అధి కారం, క్షణాలమీద బందిపోటు సమర బాహులో ఎంత మార్పు తెచ్చింది!" అన్నాడు ఖడ్గవర్మ, జీవదత్తుడితో మెల్లిగా.

అంతలో సమరబాహు, ఖడ్గజీవదత్తులతో, "క్షత్రియయోధుల్లారా! ఇక మన కోటకు బయల్దేరిపోదామంటారా?" అన్నాడు.

"రాజాజ్ఞకు తిరుగేముంది! అలాగే బయలుదేరదాం," అన్నాడు జీవదత్తుడు.

ఒంటెలమీదా, గుర్రాలమీదా ఎక్కిన సమరబాహు అనుచరులు, బందీలైన వీరపుర సైనికుల్ని కొండకోటకేసి నడిపించారు.

అందరూ కొంతసేపటికి కొండకోటను చేరేసరికి, పర్వతం దిగువనున్న చెట్లకింద ఒక చిన్న గుడారమూ, దానిముందు ఎత్తయిన ఆసనంమీద కూర్చునివున్న ఒక వృద్ధుడూ, అతడి చుట్టూ చిన్నపరివారమూ ఖడ్గజీవ దత్తుల కంటపడింది.

ఎవరీ వృద్ధుడు అని ఖడ్గజీవదత్తులు ఆశ్చర్యపడేంతలో, ఇద్దరు సేవకులు వెంట రాగా వృద్ధుడు, వాళ్ళను సమీపించి, "నేను వీరపురరాజుగారి ప్రధానమంత్రిని. మా చారులు వర్ణించినట్టు, మీరు మహాయోధు లైన ఖడ్గజీవదత్త నామధేయులయి ఉంటా రనుకుంటాను!" అన్నాడు.

అవునన్నట్టు తల ఊపి ఖడ్గజీవదత్తులు, ఆ వృద్ధమంత్రికి నమస్కరించారు. అంతలో గుర్రాలు దిగి అక్కడికి వచ్చిన సమర బాహునూ, స్వర్ణాచారినీ ఆయనకు పరి చయం చేస్తూ, "వీరు కొండకోట రాజుగారు సమరబాహు, ఆయన వారి మహామంత్రి స్వర్ణాచారిగారు!" అన్నాడు జీవత్తుడు.

వృద్ధమంత్రి తలాడించి, "స్వశక్తితో జయించుకున్న ఈ ప్రాంతాలను సమర బాహురాజుగారు నిశ్చింతగా ఏలుకోవచ్చు. ఈ మాట మా మహారాజుగారి పరంగా, వారి ప్రధానమంత్రినైన నేను చెబుతున్నాను. కానీ, నేను వచ్చింది మీ ఇద్దరికోసం.. ఏకాంతంగా మాట్లాడాలి," అన్నాడు.

తాను ఇంత సులువుగా రాజైనందుకు తన్మయుడైపోతూ సమరబాహు, వీరపుర సేనానితో, "మీరూ,మీ సైనికులూ-అందరూ ఈరోజు నాకు అతిథులు! రేపు ఉదయాన్నే బయల్దేరి మీ రాజధానీ నగరానికి వెళ్ళిపో వచ్చు," అన్నాడు.

వీరపుర ప్రధానమంత్రి, సమరబాహు కేసి చూసి చిరునవ్వు నవ్వి, ఖడ్గజీవదత్తులను వెంటబెట్టుకుని కొంచెం దూరంగాపోయి, "ఖడ్గజీవదత్తుల్లారా! మిమ్మల్నిగురించిన సమాచారం,మా చారులనుంచి విన్నదానికన్న, అనుకోకుండా ఒకానొక యక్షుడివల్ల గడచిన రాత్రి ఇంకా ఎంతగానో తెలుసుకున్నాము," అన్నాడు.

"యక్షుడా! ఎవరా యక్షుడు?" అంటూ జీవదత్తుడు ఎక్కడలేని ఆశ్చర్యంపొంది, ఖడ్గవర్మతో, "ఖడ్గా! మంత్రిగారు చెప్పే ఈ యక్షుడు, పద్మపురం రాకుమార్తె పద్మావతిని అపహరించుకు పోయినవాడు కాదుగదా?" అన్నాడు.

ఖడ్గవర్మకూడా ఆశ్చర్యంతో తలమునకలై ఉన్నాడు. వీరపుర మంత్రి వాళ్ళిద్దరికీ ఎలాంటిసమాధానం చెప్పకుండా ముందుకు నడుస్తూ పోయి, ఎదురైన ఒక చిన్న గుట్ట మీద నిలబడి, దిగువనున్న నదికేసి చేయి చూపుతూ, "ఖడ్గజీవదత్తుల్లారా! రథాకారంలో నదిలో కనిపించే ఆ పడవను పరిశీలనగా చూడండి!" అన్నాడు.

ఖడ్గజీవదత్తులు,మంత్రిచెప్పిన పడవకేసి చూశారు. అది తాము పద్మపురంలో విన్నదీ, అరణ్యపురంలో చూసినదీ అయిన రాతిరథ ఆకారంలో వున్నది.

జీవదత్తుడు ఉత్సాహంగా తన చేతిలోని దండాన్ని పైకెత్తి పట్టుకుని, "ఆహా, ఇన్నాళ్ళకు ఆ దుర్మార్గుడైన యక్షుడు మనతో ముఖాముఖి పోరాటానికి సన్నద్ధుడై వచ్చాడన్నమాట! బావుంది. మనశక్తి ఎలాంటిదో వాడికి చూపెడదాం," అంటూ నదికేసి బయలుదేరాడు. —(ఇంకావుంది)



# చీకటికొట్టు అనుభవం

దొంగ ఒకడు, ఒక రాత్రి రాజభవనంలో దొంగతనానికిపోయి, భటులకు చిక్కిపోయాడు. అయితే, ఈలోపల వాడు ఒక భటుణ్ణి బాగా గాయపరిచాడు. భటులు వాణ్ణి అప్పటికప్పుడు రాజుదగ్గరకు లాక్కుపోయి సంగతి చెప్పారు.

రాజు ఆగ్రహించి, "వీణ్ణి అయిదేళ్ళపాటు చీకటి కొట్లోపడేయండి. ఒకవేళ వీడు అయిదేళ్ళ తర్వాత ఇంకా బతికివుంటే, విడుదల రోజున నా దగ్గరకు తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

అయిదేళ్ళకాలం ఇట్టే గడిచిపోయింది, భటులు వాణ్ణి రాజుదగ్గరకు తీసుకుపోయారు. బక్కచిక్కిపోయి రోగగ్రస్తుడిలావున్న దొంగను చూడగానే, రాజుకు ఎంతో జాలి కలిగింది. ఆయన వాడితో, "చీకటికొట్లో చాలా కష్టాలనుభవించినట్టున్నది. సరే, ఈరోజుతో నిన్ను విడుదల చేస్తున్నాం,." అన్నాడు.

అందుకు దొంగరెండుచేతులూ జోడించి, "మహారాజా! చీకటికొట్లోమొదట బాధగావున్నా, తర్వాత తర్వాత అంతా సుఖంగానే జరిగిపోయింది. తెల్లవారుతూనే నిద్రలేవడం, ఆకలిబాధకు ఎక్కడ ఏది ఎలా దొంగిలించడమా అని, నాలుగు వీధులూ తిరిగే బాధ తప్పింది. అన్నిటికన్నా- వెలుగునూ, చల్లచల్లగా వీస్తున్న పిల్లగాలుల్నీ నేను భరించలేను. దయతలచి నన్నుమళ్ళీ ఆ చీకటికొట్లోకే పంపండి," అన్నాడు.

ఆ జవాబుతో రాజుకు, మనుషులు ఎంత కష్టానికైనా ఓర్చి పరిస్థితులకు క్రమంగా ఎలా అలవాటు పడిపోతారో అర్థమైంది. ఆయన వాడికి నాలుగు ఓదార్పు మాటలు చెప్పి, "భయపడకు, క్రమంగా నువ్వీస్వేచ్ఛా జీవితానికి కూడా అలవడిపోతావు," అని,వాణ్ణి తన తోటమాలి వెంట వుంటూ, తోచిన పనేదో చేస్తూండమని పంపేశాడు.



బేతాళ కథలు

# విశ్వసేనుడి దిగ్భ్రాంతి!



ఆధారం: బళ్ళారి
పి.పవన్‌కుమార్
రచన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భూతప్రేతాలకు ఆవాస మైనఈశ్మశానంలో, నువ్వు నానా ఇక్కట్లుకూ లోనవుతూతిరుగుతూండడం, ఏమాత్రం క్షత్రియోచితం అనిపించుకోదు.అయితే, నువ్వు రాజ్యవిస్తరణ కాంక్షతో సైనిక



బలాలను సమకూర్చుకునేందుకు, ఏవైనా మంత్రతంత్ర విద్యల సాయంతో అపారమైన ధనసంపాదన చేయవచ్చునన్న నమ్మకం కలిగివుంటేమాత్రం, తగు హెచ్చరికగా వుండడం మంచిది. పూర్వం విశ్వసేనుడనే రాజు, తన కోరికలన్నీ ఫలించనున్న శుభ తరుణంలో, అవివేకంకొద్దీ చపల చిత్తుడిలా ప్రవర్తించి, లభ్యమైన సదవకాశాన్ని చేజేతులా జారవిడుచుకున్నాడు. నువ్వు కూడా తుది క్షణంలో అతడిలా ప్రవర్తించకుండా తగు జాగ్రత్తలో వుండేందుకు, ఆ రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

మైథిలీ రాజ్యాన్ని పాలించేరాజు విశ్వసేనుడికి వేట అంటే మహావ్యసనం. రాజ్యానికి సంబంధించిన ఎన్ని ముఖ్యకార్యాలున్నా, ఆయనవాటినిపక్కనబెట్టి అప్పుడప్పుడు వేటకు వెళ్తూండేవాడు. ఒకసారి ఆయన కొందరు సైనికులను వెంటబెట్టుకుని, అరణ్యానికి వెళ్ళి, రెండు రోజులపాటు రకరకాల జంతువులను వేటాడడంలో ఉత్సాహంగా కాలం గడిపాడు.

మూడవనాడు తిరిగి రాజధానికి బయలు దేరబోతూండగా, సైనికుల్లో ఒకడు మరొక సైనికుడితో, ఆ చుట్టుపక్కలగల ఋష్యాశ్రమాల గురించి చెప్పడం విని, తాను ఆ ఆశ్రమాలను దర్శించాలనుకున్నాడు. ఆయన వెంటవచ్చినసైనికులతో, ''నావెంట మీరెవరూ రానవసరం లేదు. నేను ఈ ప్రాంతాలగల ఋషులను దర్శించి, సూర్యాస్తమయంలోపల తిరిగివస్తాను,'' అని బయలుదేరాడు.

గత రెండు సంవత్సరాలుగా సరైన వర్షాలు లేక, పంటలు పండక కరువు పరిస్థితులకు గురికానున్న తన రాజ్యాన్ని గురించి ఆలోచిస్తూ, రాజు నడుస్తూండగా, ఒక చెట్టు కొమ్మపైనుంచి కోతిపిల్ల ఒకటి దభీమంటూ కిందపడి బాధతో కీచుకీచుమనసాగింది.

''పాపం, తల్లిని పోగొట్టుకుని, ఇంత చిన్న వయసులో చెట్ల కొమ్మలమీద తిరగడం అంతగా అలవడక జారి కిందపడి వుంటుంది! దీన్ని ఇప్పుడు వెంట తీసుకుపోయి ఏ సైనికుడికో ఇచ్చి సాకమనడం మేలవుతుంది,'' అని విశ్వసేనుడు జాలిపడుతూ, కోతిపిల్లను పట్టుకోబోయాడు. అంతలో కొమ్మల్లోంచి తల్లికోతి కుప్పించి కిందికిదూకి, కిచకిచమంటూ రాజు చేతిని గోళ్ళతో గీరి పిల్లను పొదివి పట్టుకుని చెట్టుకొమ్మల్లోకి పారిపోయింది.

ఈ జరిగినది రాజు మనసును చాలా కలతపరిచింది. ఆయన మరికొంత దూరం నడిచి ఒక ఋష్యాశ్రమాన్ని చేరుకున్నాడు.

ఋషి, రాజును సాదరంగా ఆహ్వానించి, "రాజా, రాజధానినుంచి వేటకై ఇంతదూరం వచ్చిన మీ ముఖంలో ఆనందమేమీ కనిపించడంలేదు. కారణమేమైవుంటుంది!" అన్నాడు.

అందుకు విశ్వసేనుడు పెద్దగా నిట్టూర్చి, కోతిపిల్లను రక్షించబోతే, దాని తల్లికోతి తన చేతులను రక్కడం గురించి చెప్పి, "ఋషి వర్యా! లోకంలో, మనిషి దయాదాక్షిణ్యాలు కనబరచడానిక్కూడా జంకవలసిన పరిస్థితులు దాపురించినట్టు కనబడుతున్నది," అన్నాడు.

ఆ మాటలకు ఋషి మందహాసంచేసి, "రాజా, నువ్వు దేనిని గురించీ కొంత లోతుగా తర్కించే స్వభావంకలవాడివిగా కనిపించడం లేదు. నువ్వు వేటలో ఎన్నో లేళ్ళనూ, దుప్పులనూ ఇతర అమాయక జంతువులనూ హత మార్చివుంటావు. అప్పట్లో వాటి పిల్లలను గురించిన ఆలోచన నీకేమాత్రం రాలేదు. ఇప్పుడీ కోతిపిల్లను గురించి అంతగా మనస్సును వికలంచేసుకోవడం ఆశ్చర్యంగా వున్నది. సరే, గత రెండేళ్ళుగా వర్షాభావంవల్ల దేశంలో కరువుకాటకాలు ఏర్పడే పరిస్థితులు ఎదురుకాబోతున్నవి. అందుకు తగిన నివారణోపాయం చూడడం, రాజుగా నీ బాధ్యత," అన్నాడు.

ఋషి ఇలా అనేసరికి విశ్వసేనుడు వెలవెలపోయి, "ఋషివర్యా! ప్రతి నాలుగైదేళ్ళకొకసారి తరుణంలో వర్షాలు కురవక దేశం కాటకం పాలవడం, మా పూర్వులకాలం నుంచి జరుగుతున్నదే!" అన్నాడు.

"ఐతే దీనికేమీ తరుణోపాయంలేదా?" అన్నాడు ఋషి కాస్త కటువుగా.

విశ్వసేనుడు ఒకటిరెండు క్షణాలు మౌనంగా



వూరుకుని, తర్వాత ఋషికి తలవంచి నమస్కరిస్తూ, "ఇందుకు తరుణోపాయం లేకేం, ఉన్నది మహర్షీ! తగు ధనం ఆర్జించి, దానితో సైనికబలాలను సమకూర్చుకుని, ఇతర రాజ్యాలను జయించడం. అది సాధ్యమయ్యాక, ఆయాప్రాంతాల గల ధాన్యం, ఇతర వస్తుసామగ్రిని కొరవడిన ప్రాంతాలకు తరలించడం!" అన్నాడు.

"చాలా గొప్ప ఆలోచన రాజా! ధన సైనిక బలంతో చక్రవర్తివి కావాలన్నది, నీ ఆకాంక్ష! అలా అయితే, ఇక్కడినుంచి నాలుగు కోసుల దూరం ఉత్తరంగా ప్రయాణించావంటే, నీకు వెండికొండలు కనిపించగలవు. అప్పుడు నీక్కావలసినంత వెండిని నీ రాజ్యానికి తరలించుకుపోవచ్చు," అన్నాడు ఋషి నవ్వుతూ.

విశ్వసేనుడు, ఋషి చెప్పినవిధంగానే నాలుగుకోసులదూరం పోయేసరికి, ఎదురుగా



సూర్యకాంతిలో మిలమిలా మెరిసిపోతున్న వెండికొండలు కనిపించినై. వాటిని చూస్తూనే మైమరచిపోయి, "ఆహా, ఎంత వెండి! ఎంత వెండి! దీనిని రాజధానికి తరలించేందుకు ఎన్నివందల వాహనాల అవసరం కలుగుతుందోగదా!" అంటూ వెనుదిరిగేందుకు తలతిప్పాడు విశ్వసేనుడు.

ఆ సమయంలో అతడికి దాపులవున్న ఒక ముని పర్ణశాల కనిపించింది. ముని రెండు లేడిపిల్లలకు పచ్చికపరకలూ, లేత ఆకులూ తినిపిస్తున్నాడు. కొంచెం దూరంలో రెండు లేళ్ళు తమ పిల్లలకేసి చూస్తూ తల లాడిస్తున్నవి. ఆ దృశ్యం చూసిన విశ్వసేనుడి మనస్సు చివుక్కుమనగా, "అయ్యో! ఈ అమాయకజీవుల్ని వేటాడేందుకా నేను, రాజధానినుంచి మందీ మార్బలంతో అరణ్యానికి వచ్చింది!" అనుకుని, ముందుకడుగేసేందుకు సంశయిస్తూండగా, ముని అతణ్ణి చూసి, "రాజా, సంశయిస్తున్నావెందుకు, రా! వెంట అంగరక్షకులు లేకుండా ఇంతదూరం ఎందుకు వచ్చినట్టు?" అని అడిగాడు ప్రశాంతవదనంతో.

విశ్వసేనుడు, ఆయనకు ప్రణామంచేసి, మహామునుల దగ్గర దాపరికం కార్యహానికి దారితీస్తుందని భావించి, అంతకు ముందు ఋషి వెండికొండల గురించి చెప్పిన సంగతి వివరించాడు.

అంతా విన్న ముని, విశ్వసేనుడికేసి పరీక్షగా చూసి, "రాజా, ఈ వెండికొండలకే అంతగా తబ్బిబ్బవకు. ఉత్తరంగా మరొక నాలుగు కోసుల దూరం వెళ్ళావంటే, నీకు బంగారు కొండలు లభ్యం కాగలవు!" అన్నాడు.

బంగారు కొండలమాట వింటూనే విశ్వసేనుడు మహదానందంచెంది, మునికి నమస్కరించి, అక్కడినుంచి కదలి కాలిబాట వెంట నడిచి కొంతసేపటికి బంగారుకొండలున్న ప్రదేశాన్ని చేరాడు.

బంగారు కొండలు పచ్చని కాంతులు వెదజల్లుతూ ధగద్ధగలాడుతున్నవి. విశ్వసేనుడు ఆశ్చర్యానందాలలో మునిగిపోయి, పెద్దగా, "ఆహా, నా జీవితం ధన్యం. ఈ బంగారు కొండలన్నీ నా సొంతసొత్తు!" అంటూ చిన్నగా కేకవేశాడు.

అల్లంతదూరంలోగల ఒక సరస్సులో స్నానంచేసి బయటికి వస్తున్న ఒకయోగి, రాజు మాటలు విని, చేతిలోని దండంపైకెత్తి, "రాజా, ఈ బంగారుకొండలు కంటబడిన మాత్రానే, అంతగా మైమరిచిపోకు. మరొక్క నాలుగే నాలుగు కోసులు ఉత్తరంగా వెళ్ళావంటే, నీకు వజ్రాల గనులు దర్శనమిస్తాయి," అన్నాడు.

''నిజమా, మహాయోగీంద్రా!'' అంటూ విశ్వసేనుడు, ఆయనకు రెండు చేతులూ ఎత్తి నమస్కరించి, క్షణంకూడా అక్కడ నిలవలేక వేగంగా ఉత్తరదిశకేసి పోయాడు.

యోగి చెప్పినట్టుగానే, విశ్వసేనుడికి వజ్రాల గనులు దర్శనమిచ్చినై. ఆ వజ్రాలపై సూర్యకాంతి ప్రతిఫలించి రంగురంగుల కాంతిరేఖలు చుట్టూ అలముకుంటున్నవి. ఆ వజ్రాలమీద అక్కడక్కడా పడగలు విప్పిన మహాసర్పాలు తిరుగాడుతున్నవి.

విశ్వసేనుడు, ఆ వజ్రాల గనులను చూస్తూనే భరించలేనంతగా ఆనందంతో ఉక్కిరి బిక్కిరైపోతూ, వణుకుతున్న గొంతుతో, ''సుశిక్షితులైన నా సైనికులు ఒక్కొక్క బాణంతో రెండు, మూడు మహాసర్పాలను చంపగలరు. ఈ వజ్రాలన్నీ నా రాజ్యానికి ఏనుగులమీదా, రథాలమీదా తరలించి, రాజ్యాన్ని సుభిక్షం, సుసంపన్నం చేస్తాను. సైనికబలాన్ని అపారంగా పెంచి చుట్టుపక్కల గల రాజ్యాలన్నిటినీ జయిస్తాను. మొత్తం దేశానికి చక్రవర్తినై, ఏకచ్ఛత్రాధిపతిగా పాలిస్తాను. నా కలలన్నీ నిజమయ్యాయి. నాకంటే గొప్పవాడు, ఈ ప్రపంచంలోనే లేడు!'' అంటూ అరవసాగాడు.

ఉన్నట్టుండి అప్పుడు, ఒక కంచు కంఠం మార్మోగింది: ''రాజా, నీకంటే సంపన్నులు, నీకంటే అదృష్టవంతులు, నీకంటే గొప్పవాళ్ళు ప్రపంచంలో ఎంతోమంది వున్నారు. వాళ్ళల్లో నేనొకణ్ణి!'' అన్నమాటలు వినిపించి, విశ్వసేనుడు ఉలిక్కిపడ్డాడు.

ఆ మరుక్షణం దివ్యతేజస్సుతో వెలిగిపోతున్న, ఒక ఆకారం విశ్వసేనుడి ముందు ప్రత్య



క్షమైంది. రాజు, దిగ్భ్రాంతి చెంది, స్థాణువులా నిలబడిపోయాడు.

అప్పుడు తేజస్వి తీవ్రస్వరంతో, ''నీ కలలు ఫలించినైగదా! వెండి, బంగారం, వజ్రాలు- అపారధనాన్ని నీ రాజధానికి తరలించి, గొప్ప సైన్యాన్ని సమకూర్చుకుని, ఎక్కడెక్కడి రాజులనూ యుద్ధంలో ఓడించి చక్రవర్తివి కావాలనుకుంటున్నావు. మరి, యుద్ధాలవల్ల ఎంతో ధననష్టమే కాక, జనక్షయం కూడా కలుగుతుందన్న సత్యాన్ని నువ్వు గ్రహించ లేదా?'' అని అడిగాడు.

దానికి విశ్వసేనుడు నిబ్బరంగా, ''మహాపురుషా! రాజ్యకాంక్ష క్షాత్రధర్మమనేది తమకు తెలియందికాదు!'' అన్నాడు.

అందుకా తేజస్వి చిరునవ్వు నవ్వి, ''ప్రజాక్షేమానికి హానికలిగించేదేదీ ధర్మం అనిపించుకోదు. ప్రతి రాజ్యపాలకుడూ క్షాత్రధర్మం పేరుతో

పరరాజ్యాలనుకబళించాలనిచూస్తే, ప్రజలస్థితి ఎంత దారుణమైనస్థాయికి దిగజారిపోతుందో, నువ్వు ఊహించలేవా? పైగా, యుద్ధంలో గెలుపోటములనేవి, పుట్టుగుడ్డి చేతిలోని పావులు. సరి, రాజా! యుద్ధంలో అయినా లేక నీ రాజ్యంలో మరేనాడూ కరువుకాటకాలు రాకుండాచేసే నీ ప్రయత్నంలో అయినా– ఈ రెంటిలో ఏదో ఒకదానిలోమాత్రం నువ్వు పూర్ణ విజయుడివికాగలవని దీవిస్తున్నాను,'' అంటూ ఆ తేజస్వి అంతర్థానమయ్యాడు.

రాజు విశ్వసేనుడు మరుక్షణం వెనుదిరిగి, తాను పూర్వంవచ్చినమార్గానకాకమరొకమార్గాన తన సైనికులనుచేరి, వాళ్ళతో, ''ఈనాటినుంచీ మీరు అన్నిరకాల ఆయుధాలను ఇళ్ళల్లో భద్రపరిచి, ప్రతిఒక్కరూ రాజ్యంలోని గ్రామాలకుపోయి, అక్కడి పరిస్థితులెలావున్నవీ, నాకు వర్తమానం పంపుతూండాలి; ఇక రాజధానికి బయలుదేరండి,'' అన్నాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, ''రాజా, విశ్వసేనుడు ఎంతోకాలంగా అపారధనం సంపాదించి, సైనికబలాన్ని కూడగట్టుకుని రాజ్యాలన్నిటినీ జయించాలన్న ఆలోచనలో వున్నాడు గదా? అలాంటివాడికి గొప్ప సంపదలు లభ్యమయినై. అంతేకాక, ఆ తేజస్వి, అతణ్ణి యుద్ధంలోగాని, రాజ్యంలో కరువుకాటకాలను రూపుమాపటంలోగాని, ఏదోఒకదానిలో మాత్రం పూర్ణవిజయుడివి కాగలవని దీవించాడు. అలాంటప్పుడు విశ్వసేనుడు తన చిరకాల వాంఛ అయిన యుద్ధంలో విజయాన్ని ఎందుకు కోరుకోలేదు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ధన కీర్తి కాంక్షలతో పరితపించే ప్రతిమనిషిలోనూ, మానవత్వం, దయాదాక్షిణ్యాలూ మృగ్యమనుకోవడం సర్వత్రా సరికాదు. కోతిపిల్లను రక్షించే ప్రయత్నంలో, ఋషి సాకుతున్న లేడి పిల్లలను చూసినప్పుడు, అతనిలో కలిగిన మనోవ్యథనుబట్టి, విశ్వసేనుడిలో మానవత్వం ఎక్కడో దాగివున్నదని మనం గ్రహించవచ్చు. అంతేకాక, తేజస్వి యుద్ధంలో గెలుపోటముల గురించి చెప్పిన అనుభవోక్తితో సత్యం అతడు గ్రహించాడు. ఆ కారణంగానే అతడు రాజ్యక్షేమానికి అంకితం కాదలిచాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)



# కుందేలు ప్రతీకారం



కథ: ఎం.శంకరరావు
విజయనగరం

నవపురంలోని కుందేలు మల్లు, తెల్లవారగానే నిద్రలేచింది. అకలితో కడుపు నకనకలాడుతోంది!



ఉదయం ఫలహారానికి క్యారట్లు మాత్రమే ఉన్నాయి...




మల్లు మరింత రుచికరంగా ఏదైనా తినాలనుకున్నది.







ఎలుగుబంటి భోలా వంట ఇంట్లో వండుతూన్న వంటల వాసన పసిగట్టింది.

భోలా ఇంటికేసి పరుగు తీసింది.



... ఎదురుగా వస్తూన్న తుంటరి నక్కను చూడకుండా ఢీకొట్టింది!






నక్కకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. పళ్ళు పటాపటా కొరికింది.

కుందేలు భయంతో గడగడా వణికి పోయింది. క్షమాపణలు చెప్పుకున్నది.






అయినా నక్క శాంతించలేదు. కుందేలును తినేస్తానని పట్టు పట్టింది




నక్కబావా! కావాలంటే
నువ్వు నన్ను ఎలాగైనా తినవచ్చు.
ఒక మంచి పనికోసం మరణిం
చడం నాకు సంతోషమే!


అయితే,
రోజూ కుందేళ్ళనే
తినడంవల్ల నీ నాలుక
చవిచచ్చిపోలేదా?
ఎలుగుబంటి
వండిన ఆహారం
ఎందుకు రుచి
చూడకూడదు?


ఆ... నువ్వన్నదీ
నిజమే! కొత్త ఆహారం
కోసం ప్రయత్నించడంలో
తప్పులేదు!


కానీ, ఆ భోలా
వంటకం ఉన్నచోటికి
మనం చేరుకోవడం
ఎలా?


కుందేలు దానికి ఒక మార్గం చెప్పింది.
దానికి సరైన పథకం ఆలోచించాను.
నేను చెప్పినట్టు చెయ్యి. కొంతసేపట్లో మనం
భోలా వంటగదిలో ఉంటాం.


కుందేలూ, నక్కా డాక్టర్ భోలా
ఇంటికేసి నడిచాయి. ఉన్నట్టుండి
నక్క కిందపడి కడుపు పట్టుకుని
బాధ, బాధ అంటూ మూలిగింది.


కుందేలు పరుగునవెళ్ళి డాక్టర్ భోలాను వెంటబెట్టుకుని వచ్చింది.
డాక్టర్!
నా మిత్రుడికి
ఒంట్లో బావోలేదు.
సాయం చేస్తారా?
అతన్ని
మా ఇంటికి
తీసుకురా. కొన్ని
మాత్రలు
ఇస్తాను.


బావుంది!
సంతోషం!
నక్క భోలా ఇంటికి చేరి ఒక ఊయల
మంచంపై పడుకున్నది. కుందేలు దానికి
తోడుగా ఉంటోంది.


ఎలుగుబంటి భార్య వంటగదిలో
మధ్యాహ్న భోజనానికి వంటచేస్తోంది.
ఘుమఘుమలాడే వంట వాసనకు నక్కా,
కుందేలూ పులకరించిపోయాయి!


కొంతసేపయ్యాక, ఎలుగుబంటి డాక్టర్ భోలా, దాని భార్యా
అడవిలోకి షికారుకు వెళ్ళాయి. అప్పుడు ...
ఆహా ఇదే సరైన
తరుణం!


అవునవును!
మంచి
అవకాశం!
నక్క వంట ఇంట్లోకి జొరబడి, ఎలుగుబంటి
వండిన చేపలకూరను తినసాగింది.


కుందేలు ఆశతో దానిని సమీపించింది.
అయితే, నక్క కసిరికొట్టింది.
GRRR!
దూరంగా వెళ్ళు
మతిమాలిన
కుందేలుపిల్లా!


తినడం పూర్తయ్యాక, నక్క బిగ్గరగా త్రేన్చింది!


కుందేలు తనకు జరిగిన అన్యాయానికి కుమిలిపోయింది. నక్క స్వార్థంచూసి ఆగ్రహం చెందింది:
ఈ పాప ఫలితం అనుభవిస్తావు!
చూద్దాం,పో!


కుందేలు మాటలను పట్టించుకోకుండా, నక్క వెళ్ళి తన ఊయల మంచంలో పడుకుని నిద్రపోయింది. కుందేలు మాత్రం తీవ్రంగా ఆలోచించ సాగింది.


అంతా తినేశావా? ఆశపోతు నక్కా!
కుందేలు వంట గదిలోకి వెళ్ళి, నక్క తిని పారేసిన చేపల ముళ్ళు ఏరుకుంది.


ఆ చేపల ముళ్ళను వంట వండిన కుండనుంచి నక్క పడుకున్న ఊయల మంచం వరకు వేస్తూ వెళ్ళింది.


నక్కకు ఈ సంగతి తెలియదు. గుర్రుపెట్టి నిద్రపోసాగింది.
ఇప్పుడు చూస్తాను! అసలు కథ!


నాకు ఆకలిగా ఉంది!
వెంటనే భోజనం చేద్దాం!
ఎలుగుబంటి డాక్టర్ భోలా, దాని భార్యా వెళ్ళిన పని పూర్తిచేసుకుని ఇంటికి వచ్చాయి.


కుండ ఖాళీగా ఉండడం చూసి ఎలుగుబంటి భార్య ఆశ్చర్యపోయింది.
వండిన వంటను ఎవరు తినేశారు?


కుండ దగ్గరినుంచి ఊయలవరకు పడివున్న చేపల ముళ్ళను అది పసిగట్టింది.
ఇప్పుడు నాకు తెలిసిపోయింది!


ఎలుగుబంటి డాక్టర్ భోలా, దాని భార్యా కలిసి నక్కను తుక్కుగా బాదాయి.


ఆహాహా ఇప్పుడు తెలిసిందా ఆశపోతువెధవా!


ఈ దెబ్బలు మరీ బాధపెడుతున్నాయి. ఇప్పుడు నిజంగానే డాక్టర్‌ను చూడాలి.


అత్యాశ హానికరం!
అయిపోయింది

# పాము వరాలు


జయంతా నందా
సాంబల్‌పూర్


పి. అభిషేక్
హైదరాబాద్

ఉత్తరప్రదేశ్‌లోని రాంపూర్ అనే చిన్న గ్రామంలో రమ అనే ఒక అమ్మాయి ఉండేది. ఆమెకు చిన్నప్పుడే తల్లి చనిపోయింది. సవతి తల్లి ఆమెను రాచి రంపాన పెట్టేది. సవతి చెల్లెలు శ్యామల కూడా రమను చీటికీమాటికీ తిట్టి పోసేది. ఇంటెడుపనీ రమ ఒక్కతే చేయవలసి వచ్చేది.

''ఏమే సోమరిపోతుదానా! బట్టలు తకమంటే ఏమిటా కునుకుపాట్లు? తొందరగా కానీ.. అవతల అంట్లుతోమాలి, వంట చేయాలి, మీ అయ్యకు పొలానికి తిండి తీసుకుపోవాలి, మహారాణిలా కూర్చోవద్దు!'' అంటూ సవతి తల్లి పెట్టే చీవాట్లు వినడం రమకు అలవాటైపోయింది. అయితే రమమాత్రం ఎదురుతిరిగి పల్లెత్తుమాట అనేదికాదు.

ఒకనాడు రమ తండ్రికి భోజనం తీసుకుని పొలాలగుండా వెళుతున్నది. దారిలోవున్న చెట్టుపై నుంచి ఏదో ఉన్నట్టుండి ఆమెపై పడింది. బాధతో ఏడుస్తూ పైకి చూసింది రమ. అప్పుడే అటుగా వచ్చిన ఒక పాము అక్కడే ఆగి, ''ఎందుకమ్మా ఏడుస్తున్నావు?'' అని అడిగింది.



రమ కళ్ళు తుడుచుకుంటూ జరిగింది చెప్పింది. ఆ మాటవిన్న పాము, ''సరే. దానిని అలా ఉంచు. నువ్వు నాకొక సాయంచేస్తే, నీ కష్టాలు పోగొడతాను,'' అన్నది.

రమ ''ఏమిటి?'' అన్నట్టు చూసింది.

''మా చెల్లెలు రేపు ఒక పూజకు వెళ్ళాలి. అందు కామెకు ఒక పూలమాల కావాలి. నువ్వొకపూలమాల కట్టి ఇస్తే బావుంటుంది!'' అన్నది పాము.

రమ సరేనని, చుట్టుపక్కల పొలంగట్ల మీదఉన్న పూలనుకోసి, అందమైన పూలమాల కట్టి తీసుకువచ్చింది. దానిని చూడగానే పాము చాలా సంతోషించింది. ''పామునైనప్పటికీ నా మాట నువ్వు గౌరవించావు. చాలా సంతోషం! నీకు నేను రెండు వరాలు ఇస్తాను. నువ్వు ఇల్లు చేరేలోగా చాలా అందంగా మారిపోతావు. నీకు మృదు మధురమైన కంఠస్వరం వస్తుంది, కానీ నేను వరాలు ఇచ్చిన సంగతి ఎవరికీ చెప్పవద్దు,'' అని చెప్పి, పాము మాల తీసుకుని వెళ్ళిపోయింది.

ఇంటికి చేరగానే రమ అందంలోనూ, కంఠస్వరంలోనూ వచ్చిన మార్పును చూసి సవతి తల్లి అమితాశ్చర్యం చెంది ఏం జరిగిందని అడిగింది. రమ, పాము తన సంగతి ఎవరికీ చెప్పవద్దని హెచ్చరించిందిగనక, దాని ఊసెత్తకుండా చెట్టు మీది భూతం సాయంచేసినట్టు చెప్పి, మిగిలిన దంతా పూసగుచ్చినట్టు వివరించింది.

మరునాడు, సవతి తల్లి తన కూతురు శ్యామల చేతికి భోజనం ఇచ్చి, పొలంలో పనిచేస్తున్న తండ్రికి తీసుకువెళ్ళమని చెప్పింది. దారిలో శ్యామలకు కూడా పాము కనిపించింది. రమకు వరాలిచ్చిన పాము అదేనని శ్యామలకు తెలియదు. చెట్టుపైనున్న ఏ భూతమో, దయ్యమో ఆ వరాలు ఇచ్చి ఉంటుందని శ్యామల అనుకున్నది. అందువల్ల పాము పూలమాల కావాలని అడిగినప్పుడు, శ్యామల కోపంగా తిడుతూ దానిని అవతలికి తోసి ముందుకు వెళ్ళింది.

పాముకు కోపం వచ్చి, "ప్రపంచంలోనే అతి వికారమైన ముఖం కలిగి ఉంటావు! ప్రతి ఒక్కరూ నిన్ను తిట్టిపోస్తారు!" అని శపించింది.

ఇంటికి తిరిగివచ్చిన శ్యామల వికార ముఖం



చూసి తల్లి దిగ్భ్రాంతిచెందింది. ఏం చేయాలో ఆమెకు పాలుపోలేదు. వాళ్ళ బాధ చూసి, రమకూడా బాధపడింది. మళ్ళీ వెళ్ళి పామును కలుసుకుని శ్యామలకిచ్చిన శాపాన్ని తొలగించమని ప్రార్థించింది. "తల్లీ కూతుళ్ళ చేత నానాబాధలు అనుభవిస్తూ కూడా వాళ్ళ మంచి కోరుకుంటూన్న నీ మనసు చాలా దొడ్డది. అలాగే నీ కోరిక నెరవేరుస్తాను," అని పాము కొంతసేపు ఆగి మళ్ళీ ఇలా అన్నది: "నీ కరుణకు మెచ్చి ఇంకొక కానుక ఇస్తాను. వచ్చేవారం ఈ రాజ్యాన్నేలే రాజు, మీ గ్రామంగుండా వెళ్ళనున్నాడు. నీ మధురమైన కంఠస్వరంతో ఒక పాటపాడి వినిపించావంటే, నిన్ను రాజు ఆదరించగలడు. త్వరలో నువ్వు యువ రాణివి కాగలవు!"



రమ ఇంటికి తిరిగి వచ్చింది. శ్యామలకు పూర్వరూపం వచ్చింది. అంతేకాదు; పాము చెప్పినట్టే వారం తిరిగేసరికి, ఆ దేశపురాజు ఏదో పనిమీద ఆ గ్రామం గుండా వెళ్ళవలసి వచ్చింది. రాజుగారి రాక గురించి తెలియగానే గ్రామ పెద్దలు ఆయనకు స్వాగతం పలకడానికి సభ ఏర్పాటుచేశారు. కార్యక్రమం ప్రారంభంకావడానికి ముందు రమను ప్రార్థనా గీతం పాడమన్నారు. రమ ఆలపించిన మృదు మధురమైన ప్రార్థనాగీతాన్ని విన్న రాజు మనసు పరవశించింది. రాజు రమను ఆప్యాయంగా దగ్గరికి పిలిచాడు. ఆమెను తనవెంట తీసుకుపోయి దత్తత చేసుకుంటానని రమ తండ్రికి చెప్పాడు. ఆయన సంతోషించాడు. అయితే రమ మాత్రం అందుకు ఒప్పుకోకుండా, "మా తండ్రినీ, తల్లినీ, చెల్లెలినీ ఇక్కడే వదిలి నేనుమాత్రం రాజధానికి రాలేను, క్షమించండి," అన్నది వినయంగా.

అందుకు రాజు చిన్నగా నవ్వి, "మీ కుటుంబమే రాజధానికి రావచ్చు. మీ తల్లి తండ్రులు రాజభవనంలోనే చేతనైన పనులు చేసుకుంటూ నీ కళ్ళ ఎదుటే కాలం గడపవచ్చు. త్వరలో నువ్వే ఈ రాజ్యానికి యువరాణివి అవుతావు!" అన్నాడు రమతో.

ఆమె అందుకు అంగీకరించింది. రమ సవతి తల్లీ, కూతురు శ్యామలా అన్ని రోజులు రమను హింసించినందుకు పశ్చాత్తాపం చెంది క్షమించమని ఆమెను వేడుకున్నారు.

**కరుణ, కఠిన హృదయాలను కూడా జయిస్తుంది!**

# గాడిదకు గుణపాఠం!



ప్రాచి సి.చంద్రభూషణ్ పర్కార్, ముంబై



ఆశిష్ జి షెట్టి ముంబై

వాసు ఒకకోడినీ, కుక్కపిల్లనూ, గాడిదనూ పెంచేవాడు. గాడిదను ఇంటి వెనక ఉన్న చావడిలో గుంజకు కట్టి, అక్కడే మేత వేసేవాడు. కుక్కను వాకిట్లోకట్టి ఉంచే వాడు.

వాసు తన పనంతా ముగించుకుని ఇంటికి రాగానే, కుక్క తోక ఆడిస్తూ, కిందామీదా దూకుతూ వచ్చి అతనికి స్వాగతం పలికేది. వాసు కూడా కుక్క పిల్లను ఎంతో ఆప్యాయంగా ఎత్తుకుని, సుతారంగా వీపు నిమిరి దాంతో కొంతసేపు ఆడుకునేవాడు. దానికి రొట్టెముక్కలు వేసేవాడు. కుక్కపిల్ల వాటిని తిని ఉత్సాహంతో ఇల్లంతా తిరిగివచ్చేది.

గాడిద రోజంతా కష్టపడేది. ఇంటినుంచి పొలాలకు వ్యవసాయ పనిముట్లను మోసుకు పోయేది. అడవినుంచి ఇంటికి కట్టెలు మోసుకు వచ్చేది. యజమాని అప్పుడప్పుడూ గాడిదను నూనె గానుగకు కట్టేవాడు.

తన పరిస్థితిని తలుచుకుని గాడిద ఒకనాడు విషాదంలో మునిగిపోయింది. తనకు ఎన్ని కష్టాలు! పొద్దున లేస్తే క్షణం తీరిక లేదు. ఒళ్ళు హూనం అయ్యేలా కష్ట పడాలి. అయినా ఏ ఒక్క పనీ చేయకుండానే కుక్క పిల్ల, యజమాని చేతిలో ఎంతగానో సుఖపడి పోతున్నదని అసూయ పడింది. సాయంకాలం కుక్కను దగ్గరికి పిలిచి గాడిద తన అక్కసు వెళ్ళ బోసుకుంది: "నువ్వు ఒక్కపనికూడా చేయవు. అయినా, నీకుమంచి తిండి దొరుకుతోంది. నేనేమో బండెడుమోతలుమోస్తాను. అయినా మన యజమాని రుచీపచీలేని గడ్డిపెడతాడు. ఈ అన్యాయానికి అంతం అంటూ లేదా?"

"నా బతుకు నువ్వనుకునేటంత సులువు కాదు. నేను రాత్రి తెల్లవార్లూ మేలుకుని ఇల్లు కాపలా కాయాలి. అప్పుడే నన్ను వదిలిపెడతారు. పగలంతా వాకిట్లో కట్టు బానిసలా పడి ఉంటాను. నువ్వేమో పగలంతా స్వేచ్ఛగా తిరుగుతావు. ప్రపంచాన్నంతా చూస్తావు. పైగా మన యజమాని పొద్దస్తమానం నిన్ను కని పెట్టుకునే ఉంటాడు కదా? ఆ భాగ్యం నాకుందా? ఈ దిగులెందుకు మరి!" అన్నది కుక్క.



అయినా గాడిదకు మనసొప్పలేదు. వాళ్ళ మాటలను విన్న కోడి వికవికా నవ్వి, "మిత్రులారా! మనం మన పనులు సక్రమంగా నెరవేర్చాలే గానీ, ఇతరులతో పోల్చుకుని కుమిలి పోకూడదు. నేను గుడ్లు పెడతాను. వాటిని యజమాని తీసుకు వెళతాడు. గుడ్లు పెట్టడం వరకే నా బాధ్యత. ఆ బాధ్యతను నేను సంతోషంగా





నెరవేరుస్తున్నాను. నేనెందుకు మరొకరిలా ఉండడానికి ఉబలాట పడాలి? నేను గుడ్లు పెట్టడం మానేస్తే కోసుకు తినేస్తారని నాకు తెలుసు. అయినా, ఎదుటివారిని చూసి ఈర్ష్య పడడంవల్ల ఒరిగే దేమిటి?'' అన్నది.

ఆ మాటలు గాడిదకు ఏమాత్రం రుచించ లేదు. దానికి కుక్కపట్ల రోజు రోజుకూ అసూయ పెరిగిపోయింది. పెచ్చుపెరిగిపోయిన ఈర్ష్యతో కుదురుగా ఒకచోట ఉండలేకపోయింది. ఒకనాడు ఉన్నట్టుండి తోక ఆడిస్తూ యజమాని ఇంట్లోకి జొరబడింది. కూర్చుని ఉన్న యజమాని చుట్టూ కొంతసేపు గెంతింది. అతడికాళ్ళు నాకడానికి ప్రయత్నించింది. అంతేకాదు, యజమాని ఒళ్ళో కూర్చోవడానికి ప్రయత్నించి వెల్లకిలా పడిపోయింది. లేచి నిలబడి మళ్ళీ మామూలుగా కుక్కపిల్ల చేసే పనులన్నీటినీ చేసి, యజమాని ప్రేమను సంపాయించాలని రకరకాలుగా తంటాలు పడసాగింది.

అయితే, దాని చేష్టలు చూస్తూంటే యజమానికి అరికాలిమంట నెత్తికెక్కింది. గాడిద ఇల్లంతా గెంతడంమూలాన ఇంట్లోని వస్తువులు చిందరవందరయ్యాయి; పగిలిపోయాయి. కుర్చీలు, మేజాలు తల్లకిందులయ్యాయి. గాడిద కాళ్ళ మీది మురికితో యజమాని దుస్తులన్నీ మురికయ్యాయి. ఈ గందరగోళంలో యజమానికి చిన్నదెబ్బ కూడా తగిలింది. గాడిద చేష్టలనూ, యజమాని అవస్థనూ చూసి ఇద్దరు పనివాళ్ళు ఆయనకు సాయంగా పరిగెత్తుకు వచ్చారు. దుడ్డుకర్రలతో గాడిదను నాలుగు బాది బయటకు తరిమారు. దానిని చావడిలో గుంజకు కట్టేసి నాలుగు తగిలించారు.

గాడిద బాధతో ఓండ్రపెట్టి, ఆ తరవాత అరవలేక కదలా మెదలక ఉండిపోయింది.

బాగా చీకటిపడ్డాక, పక్కన ఏదో రెక్కల చప్పుడు విని, గాడిద అటుకేసి చూసింది. కోడి దానిని సమీపించి, ''అసూయ పనికిరాదని నేను ఎప్పుడో చెప్పాను. నామాట వినిపించుకున్నావు కావు. ఇప్పుడు బాగా అనుభవించావు. ఇతరులను చూసి వాళ్ళలా అయిపోవాలని ఉబలాట పడడం ప్రమాదకరం. మనం మన పనులను సక్రమంగా చేద్దాం. అదే మనకు క్షేమం!'' అన్నది.

కోడి మాటల్లోని నిజాన్ని ఇప్పటికి అర్థం చేసుకున్న గాడిద, అవునన్నట్టు మౌనంగా తల ఆడించింది!

అసూయ అనర్థాలకు మూలం!

# ఒంటరి చెట్టు!



కార్తిక్ రామస్వామి
చెన్నయ్



ఆషిష్ జి. షెట్టి
ముంబై

అది 2999 వ సంవత్సరం. తేదీ డిసెంబర్ 31. సమయం సాయంకాలం 8 గంటలు. రేపే నవ సహస్రాబ్ది నూతన సంవత్సరారంభం. లండన్ రాత్రి ఆకాశం మిరమిట్లు గొలిపే బాణా సంచాతో వెలిగిపోతున్నది. రాకీ కిటికీ దగ్గర కూర్చుని ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. దానిని గమనించిన వాడి తల్లి, ''రాకీ దేన్ని గురించి ఆలోచిస్తున్నావు?'' అని అడిగింది.

''అమ్మా మా ఆర్ట్స్ టీచర్ కంప్యూటర్‌లో చెట్టు బొమ్మను గీయమన్నది. చెట్టు అంటే ఏమిటమ్మా? అది ఎలా ఉంటుందో నాకు తెలియదు,'' అన్నాడు రాకీ.

''రాకీ, నువ్వు ముందు ప్రోటీన్, విటమిన్ మాత్రలు వేసుకుని రా. ఆ తరవాత చెబుతాను,'' అన్నది తల్లి.

రాకీ అలాగే వెళ్ళి రెండు మాత్రలు వేసుకుని తల్లి ఎదుట వచ్చి కూర్చుంటూ, ''ఇప్పుడు చెప్పమ్మా చెట్టు గురించి,'' అన్నాడు.

''బాబూ, మీ ముత్తాత చెట్లను గురించిన విషయాలు నాకు చెప్పాడు. అయితే, నేనెప్పుడూ నా జీవితకాలంలో ఒక్క చెట్టును కూడా చూడలేదు. ఆ మాటకొస్తే మీ ముత్తాత కూడా చూడలేదేమో! అయితే, ఇప్పుడు లండన్ మ్యూజియంలో ఒక చెట్టు ఉంది. చాలాకాలం కిందట దానికి కాండం, కొమ్మలు, రెమ్మలు, ఆకులు ఉండేవి. ఆకులు పచ్చరంగుతోనూ, కాండం ఊదా రంగుతోనూ ఉండేవి. వేల సంవత్సరాలకు పూర్వం ప్రపంచమంతటా రకరకాల చెట్లు ఉండేవి. దురదృష్టవశాత్తు ఇప్పుడు చెట్టు అన్నదే లేకుండా పోయింది. మ్యూజియంలోని చెట్టు మాత్రమే మిగిలింది. నిజానికి చెట్లు లేకుంటే వర్షాలు పడవు. అయితే, ఇవాళ



విజ్ఞానవేత్తలు కృత్రిమంగా వర్షాలు కురిపించ డానికి నూతన మార్గాలు కనుగొన్నారు. నీళ్ళు లేకుండా మనిషి బతకలేడని నీకు తెలుసు కదా?'' అన్నది తల్లి.

''అవునూ, పూర్వకాలంలో మనుషుల్లో శాకాహారులు, మాంసాహారులు అని రెండు రకాలు ఉండేవారని ఒకపాతపుస్తకంలో చదివాను. ఎవరువాళ్ళు?'' అని అడిగాడు రాకీ.

''అవును బాబూ, నిజమే. శాకాహారులంటే వృక్ష సంబంధమైన ఆహారాన్ని మాత్రమే తీసుకునేవాళ్ళు. తమ ఆహారానికి జంతువుల మీద ఆధారపడేవాళ్ళు మాంసాహారులు,'' అన్నది తల్లి.

''అలాగా!'' అన్నాడు రాకీ ఆశ్చర్యంగా.

''ఇక్కడనీకు మరొకవిషయంచెప్పాలి. లండన్ మ్యూజియంలో ఉన్న చెట్టు పూయడం, కాయడం లేదు. అంటే, పునరుత్పత్తి ఆగి పోయిందన్నమాట. ఎందుకో తెలుసా? ఆ చెట్టుకు వయసైపోయింది. పైగా ఒకే ఒక్క చెట్టు మాత్రమే ఉంటే పునరుత్పత్తి సాధ్యం కాదు. ఆ చెట్టు పూయాలి. పువ్వులు కాయలుగా మారాలంటే, గాలి లేదా కీటకాలు పరపరాగ సంపర్కానికి దోహదం చేయాలి. కాచిన కాయలు పండాలి. ఆ పండు విత్తనాలను పక్షులు దూరంగా తీసుకు వెళ్ళాలి. అక్కడ విత్తనాలు మొలకెత్తాలి. పునరుత్పత్తి జరగా లంటే ఇన్ని ఉన్నాయి. ఒంటరి చెట్టుతో అది సాధ్యమయ్యే పని కాదు,'' అన్నది తల్లి.



''అలాగా! మరి చెట్లవల్ల ఇతర ప్రయోజనాలు ఏమిటమ్మా?'' అని అడిగాడు రాకీ.

''సకాలంలో వర్షాలు కురుస్తాయి. ప్రవాహానికి మన్ను కొట్టుకుపోకుండా కాపాడుతాయి. పర్యావరణ రక్షణకు దోహదపడతాయి. పక్షులకూ, జంతువులకూ చెట్లు ఆశ్రయమిస్తాయి. చెట్ల కలపను మనం రకరకాలుగా ఉపయోగించుకోవచ్చు,'' అంటూ తల్లి చెట్ల ఉపయోగాలను వివరించింది.

అంతవరకు ఉత్సాహంగా విన్న రాకీ, ''అమ్మా చాలా విషయాలు తెలుసుకున్నాను. నువ్విప్పుడు నాకు ల్యాప్‌టాప్‌లో చెట్టుబొమ్మ వేసి పెట్టమ్మా!'' అని అడిగాడు.

''అలాగేబాబూ! ఇప్పుడే వేసి ఇస్తాను. అంతేకాదు, రేపే నిన్ను లండన్ మ్యూజియంకు తీసుకు పోయి చెట్టును చూపిస్తాను, సరేనా?'' అన్నది తల్లి.

''ఆహా! అలాగా!'' అంటూ ఆనందంతో ఎగిరి గంతేశాడు రాకీ.

**చెట్లను కాపాడుదాం! భావితరాలకు భద్రత కల్పిద్దాం!!**

## తాళంచెవి కనుక్కోండి




వృత్తంలోని తాళం చెవి పెట్టెను తెరవ గలదు. మరి మీరు మారుతాళం చెవి కనుగొనగలరా?

సమాధానం – జి

**ఎ.అనితారాణి,**
థానే.

# రంగుల హరివిల్లులు



పిల్లల ప్రత్యేక సంచికలో ప్రచురించే కథలకు చిత్రాలు వేయడానికి బాలచిత్రకారులను ఎంపికచేయడంకోసం చిత్రాలను ఆహ్వానించిందే తడవుగా దేశం నాలుగు చెరగులనుంచీ అసంఖ్యాకంగా ఎంట్రీలు వచ్చాయి. ఇవి మేము ఎదురుచూసినవాటికన్నా చాలా ఎక్కువ. బాలచిత్రకారుల ఉత్సాహం మాకు ఆనందాశ్చర్యాలు కలిగించాయి. వచ్చిన ఎంట్రీలనుంచి ఉత్తమమైనవాటిని ఎంపికచేయడం కూడా కష్టమనిపించింది. అతికష్టంమీద వేరువేరు ప్రాంతాలనుంచి ఐదుగురిని చెన్నయ్‌కి ఆహ్వానించాం. అనివార్యకారణాలవల్ల వారిలో ఇద్దరు రాలేకపోయారు. అయినా, వారు పంపిన చిత్రాలను ఈ పేజీలలో చూడవచ్చు!

మన కార్యాలయానికి వచ్చినప్పుడు తీసిన బాలచిత్రకారుల ఫోటోలతోపాటు, వాళ్ళు పోటీకి పంపిన చిత్రాలనూ మీ కోసం ఇక్కడ ప్రచురిస్తున్నాం!



అభిషేక్ పి.
హైదరాబాద్

అతడు పంపిన చిత్రం





అంజుల్ లూనియా
ముంబై

ఆమె పంపిన ఎంట్రీ





అషిష్ షెట్టి
ముంబై

అతడి చిత్రం





(వీరిద్దరూ చెన్నయ్‌కి
రాలేకపోయారు)



ప్రీతమ్‌దాస్
నార్త్ 24 పరగణాస్

రాష్మి రంజన్ దేవత
కటక్

## ప్రత్యేక ప్రశంసలు!

ఈ పోటీలో పాల్గొన్న అతిపిన్న
వయసు చిత్రకారులను
ప్రత్యేకంగా ప్రశంసిస్తున్నాము.



ఎస్.వి.ఎస్. భీమేశ్వర్ (7 సం.)
ముంబై



శ్రుతి చౌదరి (10 సం.)
హైదరాబాద్

అందరికీ
అభి
నందనలు!

# చెరపకురా చెడేవు!


మధుకర్‌శెట్టి
మంగుళూరు

చాలాకాలం కిందట ఒక అడవి ప్రాంతంలోని పెద్దచెట్టుమీద పావురాల జంట ఒకటి గూడుకట్టుకుని నివసిస్తూ ఉండేది. పావురాలు రెండూ కలిసి పగటిపూట ఆహారం కోసం వెళ్ళి వచ్చి, గూట్లో హాయిగా, ప్రశాంతంగా జీవించేవి. అదే చెట్టుకు అడుగున ఉన్న పెద్ద తొర్రలో ఒక పాము నివసిస్తూ ఉండేది. సంతోషంగా ఉన్న పావురాల జంటను చూస్తే పాముకు ఎందుకో ఈర్ష్యగా ఉండేది. వాటి సంతోషాన్ని ఎలాగైనా చెడగొట్టాలని పాము సరైన అవకాశం కోసం ఎదురుచూస్తూ రోజులు లెక్కపెట్టసాగింది.

ఆడపావురం గూట్లో రెండు గుడ్లు పెట్టింది. ఒకనాడు ఆహారంకోసం పావురాలు ఎప్పటిలాగే ఎటో ఎగిరి వెళ్ళాయి. అదే అదనుగా పాము చరచరా చెట్టుమీదికి ఎగబ్రాకి పోయి, గూట్లో ఉన్న రెండు గుడ్లూ కిందికి పడదోసి పగలగొట్టింది. ఆ తరవాత చెట్టు దిగివచ్చి తన తొర్రలో తృప్తిగా పడుకున్నది.

మరికొంతసేపటికి పావురాలు రెండూ తిరిగి వచ్చాయి. గూడు ఖాళీగా ఉండడం చూసి ఆడ పావురం గుండె విలవిలలాడింది. భోరున ఏడ్చింది. మగపావురం దానిని ఓదార్చలేకపోయింది. తొర్ర నుంచి మెల్లగా బయటకు తొంగిచూస్తూన్న పామును చూసి ఆడపావురం, "నా ఇల్లు కొల్లబోయింది. నేను పెట్టిన గుడ్లు నాశనమై పోయాయి. పొద్దుటి నుంచి నువ్వు ఇక్కడేకదా ఉన్నావు. ఇక్కడికేదైనా జంతువు రావడం నీ కంట బడిందా? ఈ దుర్మార్గానికి పాల్పడి నా కడుపులో చిచ్చుపెట్టిందెవరో చూశావా? నా గుడ్లకు ఏమయిందో ఏమో!" అని దీనంగా వాపోయింది.



పావురం ఏడ్వడంచూసి పాము లోలోపల సంతోషించింది. ఈ దుష్ట కార్యం చేసింది తనేనని పావురం అనుమానించనందుకు పాము మనసు కాస్త కుదుటపడింది. తనే ఆ పని చేసిందని పావురాలు పసిగట్టేలోగా ఆ నిందను మరెవ్వరిమీదికైనా తోసెయ్యాలని పాము ఆలోచించింది. క్షణాలలో ఒక నిర్ణయానికి వచ్చి, "అదిగో, ఆ మామిడిచెట్టు మీద ఉంటూన్న గద్ద, ఇంతకుముందు మీ గూటిదగ్గర ఉండడం గమనించాను. దాని ముక్కుకు గుడ్లున్నాయి. నన్ను చూడగానే ఆ గద్ద, 'వేలెడంత లేవు, ఈ పావురాలు. వీటికి రెండు గుడ్లు! ఎలా పిల్లలు చేస్తాయో చూస్తాను. అవంటేనే నాకు గిట్టదు,' అన్నది. నేను పగలగొట్టవద్దని అడ్డుకోబోయాను.



కాని బలహీనుణ్ణి, ఆపలేకపోయాను. ఆ గద్ద అమాంతం గుడ్లను కింద పడవేసింది. ఆ మాట చెప్పడానికి నాకు నోరు రావడంలేదు, చెల్లెలా,'' అన్నది పాము నీలికన్నీరు కారుస్తూ.

అదే చెట్టుపైన మరొక కొమ్మమీద ఆ గద్ద కూర్చుని ఉన్నదనికానీ, తాను దానిమీద మోపు తున్న నిందను అది వింటున్నదనికానీ, పాముకు తెలియదు. పాము మాటలు విన్న గద్ద పట్టరాని ఆగ్రహంతో, చెట్టుపైనుంచి ఒక్క ఊపుతో కిందికి దూకి, పామును కాలిగోళ్ళతో పట్టి పైకెత్తి, వేగంగా నేలకేసి విసిరింది. ఆ దెబ్బతో పాము చచ్చింది. ఆ తరవాత గద్ద పావురాలతో — తనకూ, వాటి గుడ్లు పగలడానికీ ఎలాంటి సంబంధంలేదనీ, నీచ స్వభావంగల ఆ పాము కావాలనే ఆ నిందను తనపై వేసిందనీ అనవసరమైన కడుపు మంటతో, నిష్కారణ ద్వేషంతో అదే గుడ్లను కిందికి తోసి ఉంటుందనీ చెప్పింది.



గద్ద మాటల్లో నిజం ఉందని పావురాలు గ్రహించాయి. శోకాన్ని దిగమింగి, రోజులు గడిచేకొద్దీ దుఃఖం నుంచి కోలుకున్నాయి. మళ్ళీ ఆడపావురం మరిన్ని గుడ్లు పెట్టింది. వాటినుంచి అందమైన పిల్లలు పుట్టుకు వచ్చాయి. అన్నీ కలిసి హాయిగా జీవించాయి. పొరుగున ఉన్న దుష్టబుద్ధిగల పాము నుంచి తమకు విముక్తి కలిగించినందుకు దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకున్నాయి!




## ముగ్గురు ఉపాధ్యాయినులు!

ముగ్గురు ఉపాధ్యాయినులు నడిచి వెళుతున్నారు. వాళ్ళ పక్కనే నడిచి వెళుతూన్న ఒక స్త్రీనుంచి పర్స్ కొట్టేసి ఒకడు పారిపోతున్నాడు. దానిని చూసిన తెలుగు ఉపాధ్యాయిని, ''దొంగ,దొంగ,''అని అరిచింది. హిందీ అధ్యాపకురాలు ''చోర్..చోర్,''అని అరవసాగింది. కొంతసేపు ఆలోచించిన లెక్కలమేడమ్, ''4 2 0, 4 2 0,'' అని బిగ్గరగా కేక వేసింది.

— ఎం.సి.నిఖిలేష్, బెంగుళూరు



కొనడానికి వచ్చిన వ్యక్తి : ఈ కుక్క విశ్వాసమైందని రూఢిగా చెప్పగలవా?
కుక్కల వ్యాపారి : గట్టిగా చెప్పగలను. దీన్ని ఐదుసార్లు అమ్మాను. వెంట వెంటనే తిరిగి వచ్చేసింది!

—ప్రశాంత్ పాండే, ముంబై

చెడుబుద్ధి
చేటు
తెస్తుంది!

# మాయా వేణువు



సార్థక్ శోభన్
శతపథి
కటక్

నిరుపేద అయిన సుమనుడికి పధ్నాలుగేళ్ళు. వృద్ధురాలైన బామ్మతప్ప వాడికి ప్రపంచంలో నా అనేవాళ్ళు లేరు. బామ్మ మరీ ముసలిది కావడంవల్ల ఏపనీ చేయలేకపోయేది. ఒంట్లో ఓపిక ఉన్నప్పుడు అడవికివెళ్ళి ఎండు కట్టెలు ఏరి, వాటిని అమ్మి గంజి కాచుకుని మనవడికింతపోసి, తాను తాగేది. అదీ లేనప్పుడు బామ్మా, మనవడూ పస్తుల తోనే అలమటించేవాళ్ళు. తనేదైనా పనిచేసి బామ్మకు సాయపడదామనుకుంటే, సుమనుడికి ఎవరూ పని చెప్పేవాళ్ళు కారు. వాడింకా పసి వయసు దాటలేదు. తన నిస్సహాయతను తలచుకుని వాడు తరచూ బాధపడేవాడు.

ఒకనాడు సుమనుడు అడవిలోని ఒక చెట్టుకిందకూర్చుని, తన దుస్థితిని తలుచుకుని ఏడుస్తూ అలాగే నిద్రపోయాడు. ఉన్నట్టుండి ఎవరో తట్టి లేపడంతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఎదురుగుండా అందమైన దేవత! "నేను కొన్నాళ్ళుగా నిన్ను గమనిస్తున్నాను. నువ్వెప్పుడూ విచారంగా కనిపిస్తున్నావు. అయినా నీకు వచ్చిన కష్టం ఏమిటి? నీ కష్టాలు తీర్చి రమ్మని దేవుడు నన్ను పంపాడు," అన్నది దేవత.

సుమనుడికి ఆశ్చర్యంతో ఒక్క క్షణం నోట మాట రాలేదు. ఆ తరవాత తేరుకుని తన కష్టాలను దేవతతో చెప్పుకున్నాడు.

సుమనుడి కష్టాలు విని, దేవత జాలి పడింది. బామ్మకు సాయపడాలనే వాడి మంచి మనసుకు సంతోషించింది. వాడికి ఒక పిల్లన గ్రోవిని ఇచ్చి, "ఇది ఒక మాయా వేణువు. తప్పు చేస్తున్న వాళ్ళ ఎదుట దీనిని ఊదావంటే వాళ్ళు శిలలుగా మారిపోతారు. దీనిని రెండవసారి ఊదావంటే వాళ్ళు మళ్ళీ మామూలు మానవ రూపాలు పొందుతారు. నువ్వు న్యాయబద్ధంగా నడుచుకున్నంత కాలం ఇది నీకు ఉపయోగకరంగా ఉంటుంది!" అని చెప్పి దేవత మాయమయింది.



సుమనుడు పరమానందంచెందాడు. నలుగురికీ ఏదైనా మంచి చేయాలన్న ఆలోచనతో అక్కడినుంచి బయలుదేరాడు. వాడు కొంతదూరం వెళ్ళేసరికి, వేగంగా వస్తూన్న గుర్రాల డెక్కల చప్పుడు వినిపించింది. వాడు చటుక్కున పొదల చాటుకు వెళ్ళి దాక్కుని ఎవరా అని తొంగిచూశాడు. బందిపోటుదొంగలు



కొందరు ఒక అందమైన యువతిని గుర్రంమీద తీసుకు వస్తున్నారు. ఆమె ఆ రాజ్యపు యువరాణి అని సుమనుడు ఊహించాడు. దొంగలు ఆమెను అపహరించుకుని వెళుతున్నారన్నమాట. సుమనుడు ఏంచేయాలో ఒక్కక్షణం ఆలోచించి దేవత ఇచ్చిన వేణువును తీసి ఊదాడు. అంతే! ఆ క్షణమే దొంగలు శిలలుగా మారిపోయారు. సుమనుడు యువ రాణిని సమీపించి, ఆమెను రాజధానికి వెళ్ళి కొందరు సైనికులను పంపమని వేడుకున్నాడు.

యువరాణి గుర్రంపై ఎక్కి రాజధానికి వెళ్ళి, జరిగిన సంగతి రాజుకు తెలియ జెప్పింది. రాజు కొందరు సైనికులను వెంటబెట్టుకుని, కుమార్తెతో సహా సుమనుడున్న చోటికి వచ్చాడు. వాళ్ళను చూడగానే సుమనుడు మళ్ళీ వేణువు ఊదాడు. శిలలుగా ఉన్న దొంగలు, మామూలు రూపాలకు వచ్చారు. సైనికులు వాళ్ళను పట్టి బంధించారు. యువరాణీ, రాజూ సుమనుణ్ణి ఎంతగానో మెచ్చుకుని, రాజభవనానికి ఆహ్వానించారు.

సుమనుడు వాళ్ళవెంట రాజభవనానికి వెళ్ళాడు. ధర్మబుద్ధీ, మహిమగల వేణువూ కలిగిఉన్న సుమనుడు పరిపాలనావ్యవహారాలలో ఎంతైనా ఉపయోగపడగలడని రాజు భావించాడు.

మరునాడురాజు సుమనుణ్ణి పిలిపించి, ''కొంతకాలంగా ఖజానా నుంచి ఎవరో ఆభరణాలూ, ధనమూ దొంగిలిస్తున్నారు. కాపలా భటులు ఎంత ప్రయత్నించినా వాళ్ళను పట్టుకోలేక పోతున్నారు. నీ మాయావేణువు సాయంతో వాళ్ళను పట్టుకోగలమేమో ప్రయత్నించి చూడు,'' అన్నాడు.

''అలాగే, ప్రభూ! అయితే ఈ విషయంలో తమరూ నా వెంట వుండి, నాకు సాయం చేయాలి,'' అన్నాడు సుమనుడు.

రాజు సంతోషంగా అందుకు అంగీకరించాడు.

ఆ రోజు రాత్రే, మరెవ్వరికీ తెలియకుండా రాజూ, సుమనుడూ ఖజానా సమీపంలో దాక్కున్నారు. అర్ధరాత్రి సమయంలో ఖజానా అధికారీ, దళనాయకుడూ కలిసి వచ్చి ఖజానాలోని నిధులను దొంగిలించడం చూసి రాజు ఆశ్చర్యంతో అవాక్కయిపోయాడు. సుమనుడు మాయా వీణను ఊదాడు. దొంగతనానికి వచ్చిన ఇద్దరూ శిలలుగా మారిపోయారు. అంతలో అక్కడికి కాపలా భటులు వచ్చారు. రాజు సుమనుణ్ణి మళ్ళీ ఒకసారి వేణువును ఊదమన్నాడు. సుమనుడు వేణువును ఊదగానే ఖజానాధికారీ, దళనాయకుడూ యథా రూపాలు పొంది, సిగ్గుతో తలవంచుకుని నిలబడ్డారు. కాపలా భటులు వాళ్ళను బంధించి చెరసాలకు లాక్కుపోయారు.

రాజు సుమనుడి సాయానికి ఆనందించి వాణ్ణి రాజభవనంలోనే ఉండమన్నాడు. వాడు బొమ్మ గురించి చెప్పగానే, రాజు ఆమెను కూడా రాజభవనానికి రప్పించాడు. సుమనుడికి విద్యాబుద్ధులు నేర్పించాడు.

యువరాణివివాహానంతరం ఆ రాజ్యానికిరాణి అయింది. సుమనుడు ఆమెకు ప్రధానసలహాదారు అయ్యాడు. రాణికి మంచి సలహాలిస్తూ ధర్మపాలన సాగించడానికి సాయపడ్డాడు!

మంచి బుద్ధి మంచి జీవితానికి పునాది!



# స్నేహం

సబీనా యస్మిన్,
నార్త్
24 పరగణాస్

అందమైన కొల్‌కతా నగర సమీపంలో ఒక చిన్నపల్లె. ఆ పల్లెలో జాఫర్ అనే కుర్రవాడు తల్లి లజ్జోబేగం, చెల్లెలు నీలిమతో కలిసి ఉంటున్నాడు. ఆటలాడుకునే అతిపిన్న వయసులోనే వాడికి కుటుంబ బాధ్యతలను మోసే శక్తిసామర్థ్యాలు అబ్బాయి. ఐదేళ్ళ నాడే వాళ్ళ నాన్న పోయాడు. అప్పటినుంచి వాడే కుటుంబ శకటాన్ని లాక్కొస్తున్నాడు.

తూరుపు తెల్లవారకముందే, జాఫర్ పట్టణంలోని సంపన్న గృహస్థు రమాపతి బాబు ఇంటికి పనికి బయలుదేరాడు. పట్టణంలో పూలమొక్కల విత్తనాల ప్యాకెట్లు కొని సంచీలో వేసుకుని, "ఈ పని దొరకడం నా అదృష్టం. ఖాన్‌చాచా దగ్గర తోటపని గనక నేర్చుకోకుండా ఉన్నట్టయితే నాగతి ఏం కాను? రమాపతి బాబు నన్నీపనికి పెట్టుకునేవాడేనా?" అని ఆలోచిస్తూ ముందుకు నడవసాగాడు. తన యజమాని రమాపతి బాబునూ, ఆయన భార్య మౌసుమీనీ తలుచుకున్నాడు. తన అదృష్టంకొద్దీ వాళ్ళెంతో దయామయులు అని లోలోపల పొంగిపోయాడు.

రమాపతిబాబు ఇంటి గుమ్మంలో నిలబడి వాడి కోసం ఎదురుచూస్తున్నాడు. ఆయన్ను చూడగానే జాఫర్ చిన్నగా నవ్వుతూ, "నమస్కారం బాబూ మోషాయ్! కొన్నిరోజుల్లో చూడండి, మన తోట అందంగా కళకళలాడబోతోంది. అవునా," అన్నాడు.

అప్పుడే వాడి దృష్టి యజమాని పక్కన నిలబడి ఉన్న కుర్రవాడిమీద పడింది. దానిని గమనించిన రమాపతిబాబు, "జాఫర్, వీడు మా అబ్బాయి, అర్జున్. నగరంలో ఓ స్కూల్లో చదువుతున్నాడు. ఈరోజే వచ్చాడు. మరికొన్ని వారాలు ఇక్కడే ఉంటాడు. నువ్వు వాణ్ణి 'చోటాబాబూ' అని పిలవవచ్చు," అని చెప్పి, కొడుకుకేసి తిరిగి, "వీడు జాఫర్! మన తోటలో పనిచేస్తాడు," అన్నాడు.

ఇద్దరు కుర్రవాళ్ళూ ఒకరినొకరు చూసుకున్నారు. అంతలో రమాపతిబాబు కొడుకుతో, "అర్జున్! లోపలికి వెళ్ళు. పొద్దున్న ఇచ్చానే ఆ పుస్తకం చదువు. నేను ఇప్పుడే వస్తాను," అన్నాడు. ఆ తరవాత జాఫర్‌కేసి తిరిగి తోటపని గురించి సూచనలివ్వసాగాడు. అంతలో అర్జున్, "బాబా! నేను జాఫర్‌తో



మాట్లాడి వెళతాను,'' అన్నాడు. అయితే రమాపతి బాబు, ''అర్జున్, నేను చెప్పినట్టు చెయ్. లోపలికి వెళ్ళు!'' అన్నాడు.

అర్జున్ అయిష్టంగా లోపలికి వెళ్ళాడు.

జాఫర్ యజమానిచెప్పే సూచనలను మౌనంగా విన్నాడేతప్ప, అర్జున్‌ను చూసినప్పుడు వాడిలో కలిగిన ఉత్సాహమంతా నీరుగారి పోయింది.

జాఫర్ ఆ రోజంతా కష్టపడి పనిచేశాడు. మనసులో మాత్రం అలలు అలలుగా ఆలోచనలు: ''అర్జున్‌కూడా నా ఈడువాడే... అయినా ఎంత అందంగా, హుందాగా ఉన్నాడు! వాడితో మాట్లాడాలనే అనుకుంటాను. అలాంటివాడితో మాట్లాడ్డం, స్నేహం చేయడం తనకు సాధ్యమయ్యే పనేనా? ఇద్దరిమధ్యా పెద్ద అగాధం ఉందికదా! నేనేమో పనిచేస్తే తప్ప కడుపు నింపుకోలేని కటిక దరిద్రుణ్ణి! అర్జున్ ధనికుడు.. తాను సేవకుడు.. అతడు యజమాని!'' ఇలా రకరకాల ఆలోచనలు!

ఆ రోజు సాయంకాలం ఇంటికి బయలుదేర డానికి సిద్ధమవుతూండగా, అర్జున్ నవ్వుతూ తనకేసి రావడంచూసి జాఫర్ ఆశ్చర్య పోయాడు. ''జాఫర్! ఉదయమే నీతో మాట్లాడనందుకు బాధగా ఉంది. నిన్ను, ఒక విషయం అడగాలని వచ్చాను,'' అన్నాడు అర్జున్.

జాఫర్ ఏమిటి అన్నట్టు చూశాడు.

''నువ్వు నాకు స్నేహితుడిగా ఉంటావా?'' అంటూ అతన్ని సమీపించి చేయి అందించాడు.

జాఫర్ ఏం చెప్పాలో తెలియక అలాగే నిల బడ్డాడు. మౌనాన్ని అంగీకారంగా భావించి, అర్జున్ వాడిచేయి అందుకుని, ''జాఫర్ ఇప్పుడు నాకెంతో సంతోషంగా ఉంది. నేను మంచి స్నేహితులకోసం తహతహలాడుతున్నాను. స్కూలు హాస్టల్లో నాకు ఒక్క స్నేహితుడుకూడా లేడంటే నమ్ము'' అన్నాడు.

ఇద్దరిమధ్యా మాటా, మాటా కలిసి స్నేహం మొగ్గతొడిగింది. ఇద్దరి మనసులూ కలిశాయి.

ఆటపాటలు కొనసాగాయి. అయితే, తమ తోటలో పని చేసే కుర్రవాడికీ, తన కొడుకుక్కూ మధ్య పెరుగుతూన్న చెలిమిని అర్జున్ తల్లి హెచ్చరికతో గమనించసాగింది. తన తల్లి దండ్రుల మిత్రుల పిల్లలతో ఆడుకోవడానికి అర్జున్ ఆసక్తి కనబరిచేవాడు కాదు. ఆ విషయంగా అర్జున్ తల్లి వాణ్ణి ఒకనాడు హెచ్చరించింది. అందుకు అర్జున్, ''అమ్మా! జాఫర్ చాలా



మంచివాడని నువ్వేకదా చెప్పావు. వాడంటే నాకు చాలా ఇష్టం!'' అన్నాడు.

ఇలా కొన్నిరోజులు గడిచాయి. ఒకనాడు అర్జున్, జాఫర్ వుండే పల్లెను చూడాలన్నాడు. వెంటనే ఇద్దరు మిత్రులూ కలిసి కాలి నడకనే బయలు దేరారు. జాఫర్ తల్లీ, చెల్లెలూ అర్జున్‌ను ప్రేమతో పలకరించారు. అతడి ఆప్యాయతకు వాళ్ళు పొంగిపోయారు. వాళ్ళు అమిత ప్రేమతో పెట్టిన ఫలహారాన్ని అర్జున్ చాలా ఇష్టంగా తిన్నాడు. నలుగురూ కలిసి రోజంతా హాయిగా గడిపారు.

స్నేహానికి లేవు అడ్డుగోడలూ, అగాధాలూ!

"అర్జున్! ఆలస్యమవు తోంది.మనం ఇప్పుడు బయలు దేరితేనే పొద్దుగూకేకల్లా మీ ఇల్లు చేరుకోగలం," అని హెచ్చరించాడు జాఫర్.

జాఫర్, అర్జున్‌తో కలిసి తిరుగు ప్రయాణ మవుతూ - అర్జున్‌ను తన పల్లెకు తీసుకు వెళ్ళినందుకు అతని తండ్రికి కోపం వస్తుందేమోనని అనుమానించాడు. అనుకున్నదే తడవుగా బయలుదేరడం వల్ల, అర్జున్ తల్లిదండ్రుల నుంచి అను మతికూడా తీసుకోలేదు. పొరబాటు జరిగిపోయింది. ఆ విషయం తలుచుకుంటే వాడికి ఒకవిధమైన భయం కలగసాగింది.

జాఫర్ అనుమానం నిజమయింది. అర్జున్ కనిపించకపోయేసరికి వాడి తల్లి తండ్రులు విచారంతో ఒకచోట నిలబడలేకపోయారు. పిల్ల లిద్దరూ గబగబా వస్తూండడం చూడగానే రమాపతి బాబుకు జాఫర్‌మీద కోపం కట్టలు తెంచుకున్నది. "ఎక్కడికి వెళ్ళివస్తున్నారు? మాతో ఒక్కమాటైనా చెప్పకుండా మావాణ్ణి తీసుకెళ్ళడానికి నీకెంత ధైర్యం? అసలు నిన్నుగురించి నువ్వేమనుకుంటు న్నావు? వెళ్ళు.. నీ ముఖం నాకు చూపకు.." అని పిడుగులా ఉరిమాడు రమాపతిబాబు.

ఒక్క నిమిషం నిశ్శబ్దం చోటు చేసుకున్నది. ఆ తరవాత అర్జున్‌నెమ్మదిగా, "బాబా! ఇందులో జాఫర్ తప్పేమీలేదు. నేనే వాళ్ళ పల్లెటూరు చూడాలని వాణ్ణి వెంటబెట్టుకు వెళ్ళాను. వాణ్ణి పనిలోకి రావద్దని



చెప్పకండి, బాబా! బాబా, జాఫర్‌ను పంపేయకండి!" అని అన్నాడు.

అయినా వాడిమాటలు తండ్రి వినిపించుకో లేదు. జాఫర్‌ను నానామాటలంటూ ఇంటినుంచి గెంటేశాడు. అర్జున్ వేదనతో ఏడ్వసాగాడు. యజ మాని ఎన్నిమాటలన్నా జాఫర్ నోరు విప్పలేదు. మౌనంగా అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడు.

ఏడ్చి, ఏడ్చి అర్జున్ స్పృహ కోల్పోయి పడి పోయాడు. దానిని చూసి వాడితల్లి మౌసుమీ, దుఃఖంపట్టలేక బావురుమంది. ఆ కేక విని రమాపతిబాబు లోపలికి వెళ్ళి చూసి, కంగారుగా డాక్టర్‌ను పిలిపించాడు.



రాజు: "రవీ, చాలా బలవంతుడైన మనిషి ఎవరో తెలుసా?"

రవి: "ట్రాఫిక్‌పోలీసు. ఒక చేత్తోనే వాహనాలన్నిటినీ ఆపేస్తాడుకదా?"

- విజేంద్రసింగ్, కోట.

డాక్టర్ చటర్జీ వచ్చాడు. అర్జున్‌ను పరీక్షించి చూశాడు. విపరీతమైన జ్వరం. ఒళ్ళు కాలిపోతున్నది. డాక్టర్ ఇంజక్షన్ చేసి, మందులిచ్చి వెళ్ళాడు. మరునాటికల్లా జ్వరమయితే తగ్గింది గాని, అర్జున్ కళ్ళు తెరవలేదు. అప్పుడప్పుడూ ఏదో పలవరిస్తున్నాడు. డాక్టర్ అతన్ని బాగా పరీక్షించాక, తండ్రితో, "రమాపతిబాబూ! ఏమయింది అర్జున్‌కి. మానసికంగా పెద్ద షాక్ తిన్నట్టున్నాడు," అని అడిగాడు.

అర్జున్ మాటిమాటికీ, "బాబా! జాఫర్‌ను పంపేయకండి! జాఫర్‌ను పంపేయకండి!" అని పలవరిస్తున్నాడు.

ముగ్గురూ కొంతసేపు వాణ్ణి నిస్సహాయంగా చూస్తూ నిలబడ్డారు.

డాక్టర్, రమాపతిబాబును పక్కకు తీసుకుపోయి, "అర్జున్‌షాక్‌నుంచి తేరుకుని, ఆరోగ్యం కుదుటపడాలంటే, వెంటనే ఆ జాఫర్‌ను పిలిపించండి," అన్నాడు.

భార్యకు ఇప్పుడే వస్తానని చెప్పి, రమాపతిబాబు జాఫర్‌వాళ్ళ పల్లెకేసి వెళ్ళాడు. జాఫర్‌ను చూడగానే ఆయన, "ఏమీ అనుకోకు బాబూ! కోపంతో ఏం మాట్లాడుతున్నానో తెలియక నిన్ను అనరానిమాటలన్నాను, నువ్వు ఇప్పుడే నావెంట రావాలి. అర్జున్ నిన్ను చూడాలంటున్నాడు," అంటూ జరిగింది చెప్పాడు. జాఫర్‌నూ, వాడి తల్లినీ, చెల్లెలనూ తనవెంట రమ్మని పిలిచాడు. అందరూ బయలుదేరారు.

జాఫర్, అర్జున్ పడకదగ్గర నిలబడి, "అర్జున్, నేను జాఫర్‌ని వచ్చాను. కళ్ళు తెరువు... నన్ను చూడు. బంధూ అర్జున్!" అన్నాడు ఎంతో ఆప్యాయంగా.

అర్జున్ తన మిత్రుడి కంఠస్వరాన్ని గుర్తించి మెల్లగా కళ్ళు తెరిచాడు. జాఫర్ మళ్ళీ పిలిచాడు. అర్జున్ మరింత పెద్దగా కళ్ళు తెరిచాడు. జాఫర్‌ను చూసి మెల్లగా నవ్వుతూ లేచి కూర్చోవడానికి ప్రయత్నించాడు. ఇద్దరు మిత్రులూ ఒకరి చేయినొకరు పట్టుకోవడంచూసి రమాపతిబాబు, మౌసుమీ, లజ్జో, నీలిమ అందరూ ఆనందబాష్పాలు రాల్చారు.

ఈ సంఘటన తరవాత అంతా మారిపోయింది. చాలా పనులు చకచకా జరిగాయి. రమాపతిబాబు, జాఫర్ కుటుంబాన్ని పెరట్లో ఉన్న తమ అవుట్ హౌస్‌లో ఉండమన్నాడు. జాఫర్‌నూ, నీలిమనూ బడిలో చేర్పించాడు. అర్జున్‌మనసులో, ఇంట్లో ఆనందం వెల్లివిరిసింది. ఆ తరవాత అర్జున్ - జాఫర్‌ల స్నేహాన్ని ఏ అగాధాలూ విడదీయలేకపోయాయి!

## అంకెల తమాషా

ఈ చిన్ని బాతులోదాగివున్న అంకెలను కనుక్కోండి చూద్దాం.



సమాధానాలు: ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పదకొండు.

- ఎ. అనితారాణి, థానే.

స్నేహానికి లేవు అడ్డుగోడలూ, అగాధాలూ!

# మృత్యుపర్వతం


పూజా చౌబే
విశాఖపట్నం


అంజల్ లూనియా
ముంబై

జపానుదేశంలో ఒకానొకప్పుడు ఒక శాసనం అమలులో ఉండేది. డెబ్బై ఏళ్ళు నిండిన వృద్ధులను తీసుకెళ్ళి దూరంగా ఉన్న కొండల మీద వదిలిపెట్టి రావాలి. అదీ శాసనం. కళ్ళు కనిపించక, చెవులు వినిపించక శారీరకంగానూ, మానసికంగానూ బలహీనమైపోయి, ఎలాంటి ప్రయోజనమూ లేకుండా ఉండే వయోధికుల భారం కుటుంబం మీదా, సమాజం మీదా పడకుండా ఉండాలన్న ఉద్దేశంతో ఆ శాసనం చేయబడింది.

ఆ కాలంలో ఒక గ్రామంలో ఇచిరో, చిరో అనే ఇద్దరన్నదమ్ములు సుమీ అనే తమ తల్లితో కలిసి నివసిస్తూండేవాళ్ళు. పగలంతా పొలంలో కష్టపడి పనిచేసివచ్చే పిల్లలను, తల్లి చిరునవ్వుతో పలకరించేది. వాళ్ళకు వండిపెట్టేది. అయితే రోజులు గడిచేకొద్దీ అన్నదమ్ముల మనసుల్లో విషాదం గూడుకట్టుకో సాగింది. తమ తల్లికికూడా డెబ్బై ఏళ్ళు నిండనున్నాయి! వాళ్ళు రోజూ దూరంగా ఉండే మంచుతో కప్పబడివున్న కొండకేసి కిటికీగుండా మౌనంగా చూసేవారు. వయోధికులు ఏళ్ళతరబడి గడించిన అనుభవజ్ఞానం; వివేకం—భావితరాలకు ఉపయోగకరంగా ఉండగలవన్న సత్యాన్ని, ఆ నీతిలేని చట్టం మరిచిపోయిందని వాళ్ళు తరచూ భావించేవాళ్ళు.

ఒకనాటి సాయంకాలం తల్లి ఇద్దరు కొడుకులనూ దగ్గరికి పిలిచి, "నాన్నలారా! ఈరోజుతో నాకు డెబ్బై ఏళ్ళు నిండాయి. రేపే నన్ను తీసుకు వెళ్ళి కొండలమీద వదిలి పెట్టండి. శాసనాన్ని ధిక్కరించ కూడదు," అన్నది.

అన్నదమ్ముల మనసులు విలవిలలాడాయి. ఇరువురూ అంతులేని విషాదానికి లోన య్యారు. అయినా శాసనం ఉల్లంఘించరానిదని తల్లి వాళ్ళకు నచ్చజెప్పింది. మరునాడు తెల్లవారేసరికి ప్రయాణానికి బట్టలు సర్దుకున్నది. ఆఖరుసారిగా వంట ముగించింది. భోజనాలయ్యాక ఇద్దరు కొడుకులూ వెంటరాగా మృత్యుపర్వతంకేసి బయలు దేరింది.



అందరూ చాలాదూరం ప్రయాణంచేసి ఆ కొండ పాదతలం చేరుకున్నారు. ముగ్గురూ మెల్లగా కొండ ఎక్కసాగారు. దారికి ఇరువైపులా పెరిగి ఎండిపోయి వున్న రెల్లుకొసలు విరుస్తూ నడిచింది తల్లి. తనేమో తిరిగి రావడంలేదు. అయినా తిరిగి వెళ్ళేప్పుడు తన పిల్లలకు ఆనవాలుగా ఉంటుందని ఆమె అలా చేసింది. కొంతసేపటికి ముగ్గురూ కొండశిఖరాన్ని చేరుకున్నారు. తల్లిని అక్కడ వదలలేక వదిలి, కొడుకులు బాధతో తిరిగి తిరిగి చూస్తూ కిందికి నడవసాగారు.

కొద్దిసేపటికి పొద్దుపోయి చీకటి కమ్ముకోవడమే కాక మంచు కురవడం ఆరంభమయింది. అన్నదమ్ములు వేగంగా కిందికి దిగసాగారు. ఉన్నట్టుండి మంచువాన ఉధృతమయింది. మంచుగడ్డలు పడ సాగాయి. అన్నదమ్ములు దారితప్పారు. ఎటు వెళ్ళాలో తెలియక వెనుదిరిగి మళ్ళీ కొండపైకివెళ్ళి 'అమ్మా'

'అమ్మా' అని అరిచారు. అసరికే మంచులో తడిసి ముద్దయిపోయి, సగం చచ్చిన స్థితిలో ఉన్న వృద్ధురాలికి కొడుకుల కంఠస్వరం వినగానే ప్రాణం లేచివచ్చినట్ట యింది. వాళ్ళు తమకు ఇంటికి వేళ్ళే దారి తెలియ లేదన్నారు. ఆమె లేచి, కొండమీదికి వచ్చినప్పుడు తాను తుంచిన రెల్లుపోచల ఆనవాలుగా దారి చూపు కుంటూ కొడుకుల వెంట ఇల్లుచేరింది.

ఇకపై తమ తల్లిని ఆ కొండమీదికి పంపకూడ దని కొడుకులు నిర్ణయించారు. ఆమెను తమ ఇంటి వెనకున్న చిన్న గుడిసెలో దాచిపెట్టి, న్యాయాధి కారుల ఎవరికంటా పడకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. ముగ్గురూ సంతోషంగా కాలం గడపసాగారు.

కొన్నాళ్ళకు ఆ ప్రాంతాన్ని పాలించే రాజుకు ఒకవింత కోరిక కలిగింది. ఆ రాజ్యంలోని పురుషులందరినీ పిలిపించి, కొన్ని పరీక్షలు పెట్టాలని నిర్ణయించాడు. తనుచెప్పే పనులను సక్రమంగా చేయనివారికి జరి మానా విధిస్తానని హెచ్చరించాడు. "మొట్టమొదటి పరీక్ష! నాకొక బూడిద తాడు కావాలి! తీసుకురండి!" అని ఆజ్ఞాపించాడు.

ఇదేమి వింతపరీక్ష అని అందరూ విస్తుపోయారు. ఇచిరో, చిరో అన్నదమ్ములు ఇంటికి వెళ్ళి తల్లికి సంగతి చెప్పారు. అంతా విన్న సుమీ, "ఇది చాలా సులభం. ఒకతాడు తీసుకుని ఉప్పునీళ్ళలో బాగా తడపండి. ఆ తరవాత దానిని ఒకలోహపు పళ్ళెంలో ఉంచి, నిప్పంటించండి. అది కాలి బూడిదవుతుంది. అయితే అందులోని ఉప్పు దానిని అలాగే తాడు రూపంలోనే బిగువుగా పట్టి ఉంచుతుంది!" అన్నది.

ఇద్దరన్నదమ్ములు తప్ప, మరెవ్వరూ ఆ పరీక్షలో నెగ్గలేకపోయారు.

"ఇక రెండవ పరీక్ష! నూలుదారం గుచ్చిన శంఖం కావాలి!" అని ఆజ్ఞాపించాడు రాజు.

దీనికికూడా సుమీ ఒక ఉపాయం చెప్పింది. "మొదట ఒక చీమను పట్టుకోండి. దాని వీపుకు సన్నటి నూలుదారం కొసను కట్టండి. ఆ తరవాత శంఖం ఉపరిభాగంలో ఉన్న రంధ్రంగుండా అది లోపలికి వెళ్ళేలా చేయండి. ఆ తరవాత శంఖం అడుగుభాగం ఉన్న రంధ్రం దగ్గర కొన్ని బియ్యపు గింజలుంచండి. బియ్యపు గింజలచేత ఆకర్షించబడే చీమ శంఖంలో జొరబడి వెలుపలికి వస్తుంది. దాంతో పాటు, దానికి కట్టిన నూలుదారం కూడా ఇవతలికి వస్తుంది," అని వివరించింది తల్లి.



అన్నదమ్ములు తెచ్చిన నూలు దారంగుచ్చిన శంఖాన్ని చూసి రాజు ఎంతగానో సంతోషించాడు.

"ఇక మూడవ పరీక్ష.కొట్ట కుండానే శబ్దంచేసే ఢమరుకం కావాలి!" అన్నాడు రాజు.

అన్నదమ్ములు ఇంటికి వెళ్ళి, తల్లికి సంగతి చెప్పారు. ఆమె, "రెండువైపులా తెరిచి ఉన్న ఒక కూజాను తీసుకోండి. దాని రెండు వైపులా శబ్దంచేసే జంతుచర్మాలను బిగించి అతికించండి. అలా అతికించే ముందు కొన్ని తేనెటీగలను అందులో వేయండి. మీరా ఢమరుకాన్ని తీసుకువెళ్ళి రాజుగారికి ఇవ్వండి. ఆయన దాన్నిచేత్తో పైకెత్తినప్పుడు అది కదలడంవల్ల, లోపల ఉన్న తేనెటీగలు రెక్కలువిప్పుకుని వెలుపలికి రావడానికి ప్రయత్నిస్తాయి. అప్పుడవి చర్మాలకు తగలడంతో, ఢమరుకం కొట్ట కుండానే శబ్దంచేస్తుంది!" అన్నది.

అన్నదమ్ములు అలాగే చేశారు. తాను పెట్టిన మూడు పరీక్షలలోనూ విజయం సాధించినందుకు, రాజు పరమానందంచెంది, అన్నదమ్ములను అభినందించాడు. అప్పుడు అన్నదమ్ములు, "ప్రభూ!ఈ అభినంద నలు, బహుమానాలు మాకు కాదు; మా ఇంటి వెనక అజ్ఞాతంగా ఉన్న మా తల్లిగారికే చెందాలి!" అంటూ అసలుసంగతి బయటపెట్టారు. విషయమంతా వివరించి, "మా తల్లికి ఇప్పుడు డెబ్బై ఏళ్ళు దాటినై. అయినా మేము ఆమెను మృత్యుపర్వతానికి చేర్చలేదు, ప్రభువులు క్షమించాలి!" అని వేడుకున్నారు.

"మనం వృద్ధులను ఆదరించాలి. వాళ్ళ అనుభవ జ్ఞానాన్ని సక్రమంగా ఉపయోగించుకోవాలి. ఈ రెండు లక్ష్యాలకూ గొడ్డలిపెట్టులా ఇన్నాళ్ళూ కొనసాగుతూ వచ్చిన ఆ నీతిలేని శాసనాన్ని ఈ క్షణమే రద్దుచేస్తున్నాను. మీ తల్లిని తీసుకురండి!" అన్నాడు రాజు.

తరవాత ఆయన సుమీని తన సలహాదారుగా నియమించి గౌరవించాడు.

**వృద్ధులను ఆదరిద్దాం! పెద్దల అనుభవజ్ఞానాన్ని గౌరవిద్దాం!!**

# మనదేశం గురించి తెలుసుకుందాం

క్విజ్

మనదేశంలో నవంబర్ 14వ తేదీని బాలల దినోత్సవంగా జరుపుకుంటున్నాం. నవంబర్ బాలలమాసం. మన పురాణాలలో బాలల గురించిన కథలు చాలా ఉన్నాయి. పురాణ బాలలకు సంబంధించిన కొన్ని విశేషాలు ఇక్కడ ఇవ్వబడ్డాయి. వాటినిబట్టి ఆ పురాణబాలలు ఎవరో చెప్పగలరేమో ప్రయత్నించి చూడండి:

1. ఒక యువరాజు తన తండ్రి వానప్రస్థానికి వెళ్ళాక, సింహాసనాన్ని అధిష్ఠించి 36,000 సంవత్సరాలు ధర్మపాలన సాగించి ఊర్ధ్వలోకం చేరాడు. ఆయన అక్కడ ఇంకా సజీవుడుగా ఉన్నాడని పురాణాలు పేర్కొంటున్నాయి. ఆ యువరాజు ఎవరు? ఆయన తండ్రిపేరేమిటి?

2. సంతానంకోసం తపస్సుచేసిన ఒక మునిని దేవుడు - మందమతిగా చిరాయువుతో జీవించగల కొడుకు కావాలా లేదా వివేకవంతుడైన అల్పాయుష్కుడు కొడుకుగా కావాలా అని అడిగాడు. ముని రెండవవాణ్ణి కోరుకున్నాడు. అలా జన్మించినవాడి పేరేమిటి? ముని పేరేమిటి?

3. తనమాట వినని కొడుకును ఒక రాక్షసరాజు చంపించడానికి రకరకాలుగా ప్రయత్నించాడు. అయినా, ప్రతిసారీ భగవంతుడు తన భక్తుడైన ఆ బాలుణ్ణి కాపాడాడు. అద్భుతమైన ఆ బాలుడు ఎవరు? అతన్ని రక్షించింది ఎవరు?

4. ఒక ఏడేళ్ళ బాలుడు, యజ్ఞంచేస్తూ గోవులను దానం ఇస్తున్న తనతండ్రి దగ్గరికి వెళ్ళి నన్నెవరికిస్తావని అడిగాడు. యముడికిస్తానన్నాడు తండ్రి. ప్రత్యక్షమైన యముడి దగ్గర ఆ బాలుడు మరణ రహస్యాన్ని తెలుసుకున్నాడు. ఆ బాలుడు ఎవరు? అతని తండ్రిపేరేమిటి?

5. రాకుమారులు కొందరు వేటకు వెళ్ళారు. వాళ్ళవెంట వెళ్ళిన కుక్క ఒక నల్లటి కుర్రవాణ్ణిచూసి మొరగసాగింది. ఆ కుర్రవాడు కుక్కకేసి తిరగకుండానే బాణం ప్రయోగించి దాని నోరు మూయించాడు. రాకుమారులు ఆశ్చర్యంతో అతన్ని సమీపించి మీ గురువు ఎవరు అని అడిగారు. అతడు చెప్పాడు. ఆ పేరు వినగానే రాకుమారులు మరింత ఆశ్చర్యం చెందారు. ఎందుకంటే అతడి గురువే తమ గురువు! ఆ కుర్రవాడెవడు? రాకుమారులు ఎవరు?

6. పులి పిల్లలతో ఆడుకుంటూ ఒక పులి కొదమనోట్లోని దంతాలను లెక్కపెడుతూన్న బాలుణ్ణిచూసి ఒకరాజు ఆశ్చర్యపోయాడు. నీ తండ్రి పేరేమిటి అని అడిగితే ఆ బాలవీరుడు ఆ రాజు పేరే చెప్పాడు. ఆ బాలుడు ఎవరు? రాజు పేరేమిటి?

(సమాధానాలు వచ్చే నెలలో)

అక్టోబర్ క్విజ్ సమాధానాలు కూడా డిసెంబర్ సంచికలోనే

## 22. ఆస్తికుడు - నాస్తికుడు!



సందీపుడు వచ్చి విషయం చెప్పగానే, అతడి తల్లి జయశ్రీ మండిపడి, "అసలు నువ్వెందుకు ఆ సమావేశానికి వెళ్ళావు? వాళ్ళల్లో కొందర్ని నేను ఎరుగుదును. ఏమీ తెలియకపోయినా, సర్వం తెలిసినట్టు విర్రవీగేరకం మనుషులు!" అన్నది కోపంగా.

"అమ్మా! నేను అక్కడికి వెళ్ళానేతప్ప వాళ్ళ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. పైగా వ్యతిరేకించాను. గోడకు వేలాడుతున్న చిత్రపటాన్ని చూపించి, 'ఇక్కడ చిత్రం ఉందంటే, ఆ చిత్రాన్ని గీసిన చిత్రకారుడు ఉన్నట్టే, ప్రపంచ సృష్టికి ఆధారంగా సృష్టికర్త తప్పక ఉండి తీరాలి'అని వాదించాను," అన్నాడు సందీపుడు.

అప్పుడే గదిలోకి అడుగుపెట్టిన దేవనాథుడు, తల్లీకొడుకులమధ్య జరుగుతూన్న ఆసక్తికరమైన చర్చ ఎలా ఆరంభమయిందని అడిగాడు. సందీపుడు కారణం చెప్పాడు:

సందీపుడు చదువుతూన్న బడిలో హేతువాదీ, నాస్తికుడూ అయిన ఒక ఉపాధ్యాయుడు ఉన్నాడు. నెలానెలా ఒక ఆదివారం సాయంకాలం ఆయన మిత్రులనూ, విద్యార్థులనూ తమ ఇంటికి ఆహ్వానించి,హేతువాదం గురించీ, నాస్తికత్వం గురించీ చర్చలు జరుపుతూ ఉంటాడు. అలాంటి సమావేశానికి వెళ్ళివచ్చినందుకే సందీపుణ్ణి జయశ్రీ మందలిస్తున్నది.

"సందీపా! ప్రతిచిత్రం వెనకా ఒక చిత్రకారుడు ఉంటాడన్న నీ వాదం వింటూంటే, వెనకటికి ఒక శాస్త్రవేత్తకూ, ఆయన స్నేహితుడికీ మధ్య జరిగిన ఒక సంఘటన నాకు గుర్తుకు వస్తున్నది. విజ్ఞాన శాస్త్రవేత్త ఆస్తికుడు. అంటే, దేవుడు ఉన్నాడని నమ్మేవాడు. అయితే, ఆయన స్నేహితుడికి దేవుడున్నాడనే నమ్మకంలేదు. పరమ నాస్తికుడు. ఈ సమస్య గురించి వాళ్ళు తరుచూ వాదోపవాదాలకు దిగేవాళ్ళేగాని, ఆమోద



యోగ్యమైన పరిష్కారం మాత్రం లభించేదికాదు.

ఒకనాడు శాస్త్రవేత్త గదిలోకి ఆయన స్నేహితుడు వచ్చాడు. శాస్త్రవేత్త బల్లమీద మెరిసే లోహంతో తయారుచేయబడిన సౌరమండలం నమూనా ఒకటి కనిపించింది. దానిని చూడగానే స్నేహితుడు, ''చాలా అందంగా ఉంది. దీనిని ఎవరు తయారు చేశారు?'' అని అడిగాడు శాస్త్రవేత్తను.

''ఎవరూ తయారుచేయలేదు. దానంతట అదే తయారయింది,''అన్నాడు శాస్త్రవేత్త.

''హాస్యోక్తులు తరవాత. దీన్ని ఎవరు తయారు చేశారో చెప్పు. చాలా బావుంది. నేనూ ఒకటి కొనుక్కుంటాను,'' అన్నాడు స్నేహితుడు.

''మిత్రమా! సూర్యచంద్రులతో, గ్రహాలతో, అసంఖ్యాకమైన నక్షత్రాలతో మహాద్భుతంగా కనిపించే అసలైన సౌరమండలమే దానంతట అది రూపొందిందని వాదించే నువ్వు – కేవలం దాని నమూనా దానంతట అదే తయారయిందని చెబితేమాత్రం నమ్మనంటావెందుకు?'' అని అడిగాడు శాస్త్రవేత్త.

స్నేహితుడు సరైన సమాధానం చెప్పలేక మౌనంగా ఆలోచించసాగాడు. శాస్త్రవేత్త చెప్పిన ఆ ఒక్కమాటతో వాళ్ళిరువురిమధ్యా అంతకాలం కొనసాగుతూ వచ్చిన వాదోపవాదాలు అంతమయ్యాయి,'' అన్నాడు దేవనాథుడు.

''అయినా, దేవుడున్నాడని విశ్వసించని మనుషులు ఉన్నారంటేనే నాకు నమ్మశక్యం కావడంలేదు. ఆలోచనాపరుడైన మనిషి దేవుణ్ణెలా లేడనగలడు?'' అని అడిగింది జయశ్రీ ఆశ్చర్యంగా.

''అమ్మా! దేవుడు ఉన్నాడు అని మాట్లాడడం ప్రారంభించిననాడే, దేవుడు లేడు అని చెప్పేవాళ్ళూ బయలుదేరారు. ఇక్కడ నువ్వు ఒక విషయం గమనించాలి. దేవుడిపేరు చెప్పే వాళ్ళందరూ నిజంగానే దేవుణ్ణి నమ్ముతున్నారని అనుకుంటున్నావా? దేవుడిమీది నమ్మకం అన్నది ఒక అలవాటుగా, ఆచారంగా, చెప్పాలంటే ఒక మూఢవిశ్వాసంగానే వస్తున్నది. నాస్తికులకు ఒక విధమైన అజ్ఞానం అనుకుంటే, ఆస్తికులూ మరొకవిధమైన అజ్ఞానంతోనే బతికేస్తున్నారు. అందువల్ల, వివేకంలోగానీ, తెలివితేటల్లోగానీ, మనస్సాక్షితో మసలుకునే జీవన విధానంలోగానీ, ఆస్తికులని చెప్పుకునేవాళ్ళు నాస్తికుల కన్నా గొప్పవాళ్ళని రూఢిగా చెప్పలేము,'' అన్నాడు దేవనాథుడు.

''అయితే, మన ప్రాచీన భారతసంస్కృతి దైవ నమ్మకాన్ని యుగయుగాలుగా ప్రబోధిస్తున్నదికదా? మరి అది నిజంకాదా?'' అని అడిగింది జయశ్రీ ఆశ్చర్యంతో.

''నిజమే తల్లీ! తరతరాలుగా సత్యాన్ని అన్వేషిస్తూ జీవితంలోని అర్థాన్ని వెతుక్కుంటూ, ముందుకు సాగుతూన్న సంప్రదాయం మనది. మనకెన్నో ఉదాత్త భావాలూ, సిద్ధాంతాలూ ఉన్నాయి. అయినా, ఏ ఒక్కటిగానీ మిగతావాటిని నాశనంచేయడానికి పూనుకోలేదు. నిజానికి, భారతభూమిలోనే ప్రప్రథమంగా నాస్తికవాదం ప్రారంభమై కొంతవరకు ప్రాచుర్యంకూడా పొందింది. దానిని చార్వాకుడనే తత్వవేత్త ప్రచారం చేశాడు. ఆయన లోకాయతవాదమనే ఆలోచనా విధానాన్నీ, సిద్ధాంతాన్నీ రూపొందించాడు. ప్రపంచమే సర్వస్వం అని బోధించిన బృహస్పతివంటి నాస్తిక తత్వవేత్తలూ ఉన్నారు,'' అన్నాడు దేవనాథుడు.

''బృహస్పతి దేవగురువుకదా, తాతయ్యా?'' అని

అడిగింది శ్యామల ఆశ్చర్యంతో.

"ఈ బృహస్పతి వేరు. ఈయన ఒక పండితుడు. మహామేధావి. లోకాయత సిద్ధాంతాలను ప్రచారం చేసిన తత్వవేత్తలలో అజితుడు, సంజయుడనేవారు సుప్రసిద్ధులు. అయితే, చార్వాకుడికి అనంతరం ప్రాచీన 'అజీవిక' సిద్ధాంతాన్ని మళ్ళీ ప్రచారం చేసిన గోశాలుడనే నాస్తికవాదినే అందరూ ముఖ్యంగా చెప్పు కుంటారు. ఆయన జీవితం విషాదాంతమయింది!" అన్నాడు దేవనాథుడు.

"ఎందుకు విషాదాంతమయింది?" అని అడిగింది జయశ్రీ.

"అదొక ఆసక్తికరమైన ఉదంతం," అంటూ దేవనాథుడు గోశాలుడి కథ చెప్పసాగాడు:

అహింసను పరమధర్మంగా బోధించే జైన మతాన్ని స్థాపించిన వర్ధమాన మహావీరుడి సమకాలికుడు గోశాలుడు. మొదట ఇద్దరూ మంచి స్నేహితులుకూడా. అయితే, క్రమక్రమంగా మహావీరుడంటే గోశాలుడికి అసూయ ఏర్పడిందని చెబుతారు.

ఒకనాడు ఆ ఇద్దరు మిత్రులూ కలిసి అడవి మార్గంగుండా నడిచి వెళుతున్నారు. చిన్న చిన్న మొగ్గ లతో ఒక చెట్టుకు అల్లుకుని ఉన్న పచ్చటి పూలతీగ ఒకటి వర్ధమానుడి కంటబడింది. ఆయన దానిని సంతోషంగా గోశాలుడికి చూపుతూ, "మిత్రమా! ఆ తీగను చూడు! ఈరోజు తీగకు మొగ్గలుగా ఉన్నవి ఒకటి రెండు రోజుల్లో పువ్వులుగా వికసిస్తాయి! ప్రకృతి ఎంత అద్భుతమైనదో గమనించావా?" అన్నాడు.

"అవి తప్పక వికసించగలవని నువ్వు చెప్ప గలవా?" అని గద్దించి అడిగాడు గోశాలుడు.

మిత్రుడి కంఠస్వరం విని ఒక్కక్షణం విస్తు పోయాడు మహావీరుడు. తనేదో యథాలాపంగా ఆమాట అన్నాడు. అయినా ఇప్పుడు ఆయన తీవ్రంగా ఆలోచిస్తూ గంభీరవదనుడయ్యాడు. ఒక్కనిమిషం కళ్ళు మూసుకుని తెరచి, "అవును! ఈ మొగ్గలు తప్పకుండా పువ్వులుగా వికసించగలవు!" అన్నాడు ఎంతో విశ్వాసంతో.

గోశాలుడు కాస్త హేళనగా, నర్మగర్భంగా నవ్వాడు తప్ప, మరేమీ మాట్లాడలేదు. ఇద్దరూ కలిసి మళ్ళీ ముందుకు నడవసాగారు. కొంత సేపటికి ఒక ముని ఆశ్రమంచేరి, రాత్రికావడంతో అక్కడే పడుకున్నారు.

అర్ధరాత్రి అయింది. మహావీరుడు గాఢ నిద్రలో ఉన్నాడని గ్రహించి, గోశాలుడు గుట్టు చప్పుడు కాకుండా లేచి, ఆశ్రమం నుంచి వెలుపలికి వచ్చి, చకచకా మొగ్గల తీగ అల్లుకున్న చెట్టుదగ్గరికి చేరాడు. కొసితో తీగను తెంచి, చుట్టచుట్టి దాపుల నున్న ఒక గోతిలో పడవేసి, ఆశ్రమానికి తిరిగివెళ్ళి పడుకున్నాడు.



రెండు రోజుల తరవాత ఇద్దరు మిత్రులూ అదే అడవి మార్గంగుండా వెళ్ళడం తటస్థించింది. రెండు రోజుల క్రితం ఆ తీగను చూసినప్పుడు వాళ్ళమధ్య జరిగిన సంభాషణల గురించి మహావీరుడు మరిచి పోయాడు. గోశాలుడు మాత్రం ఆ చోటును సమీ పించబోతూ, "నువ్వు మొన్నచూసిన మొగ్గలు నువ్వు చెప్పినట్టు ఈ రోజు పూచి వుండవు!" అన్నాడు హేళనగా నవ్వుతూ.

"నువ్వు అలా అనుకుంటున్నావా?" అని అడి గాడు మహావీరుడు ఆశ్చర్యంగా.

"అనుకోవడంకాదు; నాకు దృఢంగా తెలుసు. పువ్వులు పూయలేదు," అన్నాడు గోశాలుడు నమ్మకంతో.

మాట్లాడుతూ వాళ్ళు తీగ ఉన్నచోటికి చేరారు. గోశాలుడు తెంచి గోతిలో పడవేసిన తీగ అక్కడే వేళ్ళూ నింది. నిన్నరాత్రి కురిసిన వానకు మొగ్గలన్నీ రంగు రంగుల పువ్వులుగా పూచి కళకళలాడుతున్నాయి.

మహావీరుడు మందహాసంచేస్తూ వాటిని చూపాడు గానీ, మరేమీ మాట్లాడలేదు.అయితే, తీరని ఆశా భంగానికి గురైన గోశాలుడు ఆవేశంతో ఒళ్ళుమరిచి మహావీరుణ్ణి నానామాటలన్నాడు. "అంతా ముందే నిర్ణయమై ఉన్నట్టయితే, మనం ఎందుకు పని చేయాలి? మన చేతలకు అర్థం ఏమిటి? అసలు మానవ జీవితానికి అర్థం పర్థం అంటూ ఉంటుందా?" అని మండిపడుతూ అక్కడినుంచి వెనుదిరిగి వెళ్ళి పోయాడు.

రోజులు గడిచేకొద్దీ ఆయన మహావీరుడిపట్ల, తీరని అసూయ, ద్వేషం, పగ పెంచుకున్నాడు. మహావీరుడు ప్రచారంచేసే ప్రతి సిద్ధాంతానికీ ప్రతి కూలంగా ప్రచారం చేయడం ప్రారంభించాడు. అంతటితో ఆగకుండా, మంత్ర తంత్రాలతో మహా వీరుణ్ణి మట్టుపెట్టడానికి ప్రయత్నించాడు. అయితే మహావీరుడి మంచితనం, ఆధ్యాత్మికబలం ఆయన ప్రాణానికి కవచంగా నిలిచాయి. గోశాలుడు ఆయన మీదికి ప్రయోగించిన దుష్టశక్తులు, ఆయన్ను ఏమీ చేయజాలక గోశాలుడి మీదికే తిరగబడ్డాయని చెబు తారు. గోశాలుడు రోగగ్రస్తుడయ్యాడు. కొన్నాళ్ళకు మతి చలించి మరణించాడు.

"నిప్పురవ్వలా ఆరంభమయ్యే అసూయ క్రమంగా కారుచిచ్చులా మనిషి జీవితాన్ని ఎలా నాశనం చేస్తుందో చూశారు కదా?" అన్నాడు దేవనాథుడు కథకు ముగింపుగా. — (ఇంకావుంది)





# దేవీభాగవత కథలు

దనవుడి కొడుకులు రంభుడూ, కరంభుడూ అనేవాళ్ళు తమకు పిల్లలు లేని కారణంగా చాలాకాలం తీవ్ర తపస్సు చేశారు. కరంభుడు పంచనద తీర్థంలో మునిగి తపస్సు చేశాడు. రంభుడు ఒక చెట్టుమీద ఎక్కి కూర్చొని తపస్సు చేశాడు.

ఇంద్రుడు మొసలిరూపంలో పంచనదంలో ప్రవేశించి, కరంభుణ్ణి చంపేశాడు. తన తమ్ముడి చావుకు రంభుడు శోకావేశంతో అగ్నిహోత్రుడికి తన తల అర్పించటానికి చేత్తో కత్తి ఎత్తాడు.

అప్పుడు అగ్ని ప్రత్యక్షమై, "ఎందుకు ఆత్మహత్య చేసుకుంటున్నావు? దానివల్ల ఇహమా, పరమా? నీ తపస్సు చూసి నేను సంతోషించాను. కోరుకో, వరం ఇస్తాను," అన్నాడు.

"దేవా, నీకు నామీద అనుగ్రహం ఉంటే నాకు అజేయుడైన ఒక కొడుకును ఇయ్యి! వాడు కామరూపీ, దేవతలకుగానీ, దానవులకుగానీ, జయించరానివాడుగా ఉండాలి," అన్నాడు రంభుడు.

"అలాగే అవుతుంది," అని అగ్నిహోత్రుడు అదృశ్యమయ్యాడు.

రంభుడు తిరిగి వస్తూ, యక్షుల అధీనంలో ఉన్న ఒక అందమైన ప్రదేశంలో ఒక గేదెను చూశాడు. ఆ మహిషి అతని వెంట పాతాళానికి వచ్చేసింది.

అక్కడ ఆ మహిషిని మరొక మహిషం వెంబడించింది. అదిచూసి రంభుడు ఆగ్రహావేశంతో దాన్ని కొట్టాడు. ఆ మహిషం (దున్నపోతు) రంభుణ్ణి తన కొమ్ములతో పొడిచి పైకెత్తి, చంపేసింది. అది చూసి

4. మహిషాసుర వధ



మహిషి రంభుడితోపాటు చితిమంటలలో కాలి పోయింది. ఆ మంటల నుంచి ఇద్దరు రాక్షసులు వెలువడ్డారు. ఒకడు మహిషుడు. ఇంకొకడు రక్తబీజుడు.

రాక్షసులు మహిషాసురుణ్ణి తమ రాజుగా ఎన్నుకున్నారు. మహిషుడు కాంచన పర్వతం మీద గొప్ప తపస్సుచేసి, బ్రహ్మదేవుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, "మహాత్మా, నాకు చావు లేకుండా చెయ్యి," అని వరం కోరాడు.

దానికి బ్రహ్మ, "పుట్టినవాళ్ళంతా చావక తప్పదు, చచ్చినవాళ్ళు పుట్టకా తప్పదు. చావకుండానీకు వరం ఎలా ఇయ్యగలను? భూమికీ, సముద్రానికీ, కొండలకూ సైతం నాశనం ఉన్నది గదా! చచ్చిపోవటానికి అవకాశం వదిలి వరంకోరుకో, అలాగే ఇస్తాను," అన్నాడు.

అప్పుడు మహిషుడు, "ఆడది ఎలాగూ నన్ను చంపలేదు గనక, దేవతలలోగాని, దానవులలోగాని, మానవులలోగాని ఏ పురుషుడి చేతా నాకు చావు లేకుండా అనుగ్రహించు," అని బ్రహ్మను కోరాడు.

"అలాగే, కాని నీకు ఎప్పటికైనా స్త్రీ మూలంగానే చావు వస్తుంది," అని బ్రహ్మ వెళ్ళిపోయాడు.

ఈ వరంపొంది ఉన్న మదంతో మహిషుడు స్వర్గాన్ని ఆక్రమించాలన్న ఉద్దేశంతో యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. ఒక సేవకుణ్ణి పిలిచి, ఇంద్రుణ్ణి హెచ్చరించి రమ్మని పంపాడు. వాడు వెళ్ళి ఆమాట ఇంద్రుడికి చెప్పాడు.

ఇంద్రుడు ఆవేశంతో దిక్పాలకులను సమావేశపరచి, వారితో ఇలా అన్నాడు:

"రంభుడికొడుకు మహిషుడు బ్రహ్మ వల్ల వరాలు పొందిన మదంతో యుద్ధానికి సేనలను సన్నద్ధంచేస్తూ, ప్రగల్భాలు పలుకుతున్నాడు. వాడు స్వర్గాన్ని జయిస్తాడట. మహిషుడికి సేవకుడివిగా ఉంటావో, యుద్ధమే చేస్తావో తేల్చుకోమని వాడిదూత వచ్చి చెప్పి పోయాడు. అందుచేత మనం ఏం చెయ్యాలో తేల్చండి. శత్రువు ఎంత బలవంతుడైనా క్షమించరాదు. జయాపజయాలు దైవాధీనమే అయినా ప్రయత్నం మానరాదు. సంధి చేయటం మంచిదే. కానీ ఇలాటి దుర్మార్గుడితో సంధి విషమిస్తుంది. యుద్ధం చెయ్యాలన్నా మన బలాలూ, శత్రుబలాలూ సరిగా అంచనా వెయ్యవలసి ఉంటుంది. అందుకు ఒక మనిషిని పంపుదాం."

ఇంద్రుడు పంపిన దూత వెళ్ళి త్వరగా తిరిగి వచ్చి, మహిషుడి బలాలను గురించి చెప్పేసరికి ఇంద్రుడు విస్మయం చెంది, తన పురోహితుడైన బృహస్పతిని, "మహిషుడు అంతులేని సేనలతో మనమీదికి యుద్ధానికి

వస్తున్నాడు. ఏమిటి ఉపాయం?'' అని అడిగాడు.

ఇంద్రుడి కంగారుచూసి బృహస్పతి, ''అపాయం ఎదురైనప్పుడు ధైర్యం విడిచి పెట్టరాదు. ధైర్యంగా ఉండు. అయ్యేది కాకుండా ఉండదు. అయినా శాయశక్తులా ప్రయత్నం చెయ్యవలసిందే! అందుకే కదా మహర్షులు మోక్షం కోసం తపస్సు చేస్తారు? అచ్చగా దేవుణ్ణి నమ్ముకుంటే పని జరగదు. మనం ప్రయత్నంచేసినా ఫలితం కలగకపోతే అది దైవికం,'' అన్నాడు.

దానికి ఇంద్రుడు, ''దేవా, ప్రయత్నించక పని జరగదు. యతులకు విజ్ఞానమూ, బ్రాహ్మణులకు తృప్తీ ఎలాగో రాజులకు శత్రు సంహారం అలాగు. నువ్వు అనుకూలంగా సలహా ఇస్తే, నేను యుద్ధ యత్నం చేస్తాను. నాకు నువ్వూ, వజ్రాయుధమూ, హరి హరులూ సహాయులు,'' అన్నాడు.

బృహస్పతి ఇంద్రుడితో, ''నేను నిన్ను యుద్ధంచెయ్యమనిగానీ, వద్దనిగానీ సలహా చెప్పను. మీమీ బుద్ధికి తోచిన ఉపాయాలు ఆలోచించండి,''అన్నాడు.

అప్పుడు ఇంద్రుడు బ్రహ్మను శరణు జొచ్చి, ''మహిషుడు అనేవాడు మదించి స్వర్గంమీదికి సైన్యంతో దండెత్తి వస్తున్నాడు. వాడినుంచి నాకు చాలా భయం కలుగు తున్నది. నా దురవస్థ చూడు!'' అన్నాడు.

ఇంద్రుడి మాటలు విని బ్రహ్మ ''మనం శివుణ్ణీ, విష్ణువునూ వెంటబెట్టుకుని యుద్ధం చెయ్యటం మంచిది. ముందు కైలాసానికి పోదాం,'' అన్నాడు.

ఇద్దరూ కలిసి శివుడివద్దకు వెళ్ళి



సంగతి చెప్పారు. తరవాత ముగ్గురూ కలిసి విష్ణువు వద్దకు వెళ్ళారు. అందరూ కలిసి మహిషుడితో యుద్ధం చెయ్యటానికి నిర్ణయం జరిగింది. హంసమీద బ్రహ్మ, గరుత్మంతుడి పైన విష్ణువూ, ఎద్దుమీద శివుడూ, నెమలిమీద కుమార స్వామీ, ఏనుగు మీద ఇంద్రుడూ ఎక్కి యుద్ధా నికి బయలుదేరారు. దేవసేన లూ, రాక్షస సేనలూ ఒకదాన్ని ఒకటి ఎదుర్కొన్నాయి.

యుద్ధం భయంకరంగా సాగింది. ఎంత శౌర్యపరాక్రమాలు ప్రదర్శించినా దిక్పా లకులూ, ఇంద్రుడూ, త్రిమూర్తులూ మహి షుడి ధాటికి తట్టుకోలేక చివరకు పారి పోయారు. స్వర్గం మహిషుడి వశమయింది. మహిషుడు ఇంద్రుడి సింహాసనం మీద కూర్చుని, పదవులన్నిటా తన రాక్షసులను



నిలిపి, దేవతల ధనాగారాలన్నీ స్వాధీనం చేసుకుని, స్వర్గసుఖాలు అనుభవిస్తూ పాలించసాగాడు. దేవతలుకొండలూ, గుట్టలూ పట్టి పోయి, అష్టకష్టాలూ పడ్డారు.

ఇలా కష్టాలు పడలేక దేవతలు ఒకసారి బ్రహ్మ కొలువుకు వెళ్ళి, "ఒక్కమహిషాసురుడు మమ్మల్నందరినీ జయించి, మాకు ఇటువంటి దుస్థితి తెచ్చిపెట్టాడుగదా, తండ్రివంటివాడివి, మా దుస్థితి ఎందుకు చూడవు? సర్వజ్ఞుడివి, మా గతి ఏమిటి?" అని వాపోయారు.

"నన్నేం చెయ్యమంటారు? వాడు తనను ఏ పురుషుడూ చంపకుండా వరం పొందాడు. వాణ్ణిచంపితే ఆడదే చంపాలి. మనం ముందు శివుడితోనూ, తరవాత విష్ణువుతోనూ ఆలోచిద్దాం," అన్నాడు బ్రహ్మ.

దేవతలందరూ బ్రహ్మవెంట శివుడి వద్దకు వెళ్ళారు.

"ఏం పనిమీద వచ్చారు?" అని శివుడు వారిని అడిగాడు.

"నీకు తెలియనిదేమున్నది? మహిషాసురుడు స్వర్గం ఆక్రమించి ఇంద్రుణ్ణీ, దేవతలనూ అష్టకష్టాలపాలు చేశాడు. వాళ్ళు తమ గతి ఏమిటని అడుగుతున్నారు," అన్నాడు బ్రహ్మ.

శివుడు చిరునవ్వు నవ్వి, "దేవతలకు ఈ అనర్థం కలిగించినది నువ్వేకదా! నీ వరంవల్ల వాణ్ణి ఏ మగవాడూ చంపలేడు. మరి వాణ్ణి చంపటానికి ఏ ఆడదాన్ని పంపుదాం? నీ భార్యను పంపుతావా? నా భార్యను పంపనా? లేక ఇంద్రుడి భార్య పోతుందా? మన భార్యలలో ఒకతె కూడా యుద్ధం చెయ్యగలది కాదే! అందుచేత ఏంచేస్తే బాగుంటుందో విష్ణువును అడుగుదాం. అతను నాకన్న తెలివిగలవాడు," అన్నాడు.

అందరూ కలిసి విష్ణువుదగ్గరకు వెళ్ళారు. వాళ్ళు వచ్చిన పని విని విష్ణువు, "మనమంద రమూ మహిషుడితో యుద్ధంచేసి ఓడినవాళ్ళమే గదా! వాణ్ణి ఆడదే చంపాలంటే మన అందరి తేజస్సుతోనూ ఒక స్త్రీని తయారు చేసి, ఆమెకు మన ఆయుధాలిచ్చి, ఆమె చేత మహిషుడితో యుద్ధం చేయించాలి," అన్నాడు.

విష్ణువు ఇలా అంటూండగానే దేవత లందరినుంచీ రకరకాల తేజస్సు వెలువడి, అది క్రమంగా ఏకమై, పద్ధెనిమిది చేతులు గల స్త్రీ మూర్తిగా తయారయింది. దేవతలు ఆమె చేతులలో తమతమ ఆయుధాలు ఉంచారు. ఆమె దేవతలతో, "భయపడకండి. ఆ రాక్షసుణ్ణి నేను చంపుతాను!" అంటూ సింహనాదం చేసింది.

దాన్ని విని మహిషుడు, "ఎవడు ఈ ధ్వని చేసినది? వెళ్ళి, వాణ్ణిపట్టి తీసుకురండి! నా చేత చావుదెబ్బతిన్న దేవతలకు ఇంత సాహసం ఉండదే!" అన్నాడు తన వాళ్ళతో.

వాళ్ళు వచ్చి మహాదేవి అవతారం చూసి బెదిరిపోయి, మహిషుడితో, "ఎవతో సింహం ఎక్కి వచ్చింది. ఒంటినిండా ఆభరణాలు, పద్ధెనిమిది చేతులలో ఆయుధాలు!" అని చెప్పారు. మహిషుడు తన మంత్రితో, "ఎలాగైనా ఆ స్త్రీని తీసుకురా! నా పట్టమహిషిగా చేసుకుం టాను!" అన్నాడు.

మంత్రి వచ్చి, దూరంగా నిలబడి దేవితో, "అమ్మా, నువ్వెవరు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? సర్వలోకపాలకుడు మహిషాసురుడు నిన్ను పెళ్ళాడకోరుతున్నాడు," అన్నాడు.

దేవి చిన్నగా నవ్వి, "వాణ్ణి చంపటానికే వచ్చాను. నువ్వు మంచివాడివిలాగున్నావు. నిన్ను చంపను. మీ ఏలికకు నేను వచ్చిన పని చెప్పు!" అన్నది.

మహిషుడు తన మంత్రి మాటలు నమ్మ లేక, రాయబారానికి తన సేనాపతిని తామ్రుణ్ణి పంపాడు. దేవి వాణ్ణి చంపింది. అంతటితో మహిషుడి ప్రేమఘట్టం అంతమయింది. అతను దేవితో యుద్ధానికి తన సేనాపతు లను పంపాడు. అందరూ దేవిచేత చచ్చారు. తరవాత మహిషుడే దేవి సంగతి తేల్చుకునేటందుకు వచ్చాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. మహిషుడు కామరూపి కావటంచేత, అనేక రూపాలు ధరించి దారుణ యుద్ధం చేశాడు. చివరకు దేవి వాణ్ణి చక్రాయుధంతో తల నరికి చంపేసింది. దేవతలు పరమ సంతోషం పొంది, దేవిని స్తోత్రం చేశారు.





# నిత్య సంతోషి

భీమయ్య, రామయ్య ఇరుగు పొరుగున వుంటున్నారు. రామయ్య ఎప్పుడూ సంతోషంగా వుండేవాడు. అయితే, భీమయ్య మాత్రం ఎప్పుడూ విచారంగా వుండేవాడు.

రామయ్యకు నాలుగెకరాల పొలం వుంది. అతడి ఆనందానికి అదే కారణం అనుకుని, భీమయ్య రాత్రింబవళ్ళు కష్టపడి పనిచేసి జాగ్రత్తగా డబ్బు కూడబెట్టి, ఏడాదిలో అయిదెకరాల పొలం కొన్నాడు. అయినా, రామయ్య అతనికంటే ఎక్కువ సంతోషంగా వున్నాడు. అందుకు కారణం ఏమై ఉంటుందా అని భీమయ్య చాలా తీవ్రంగా ఆలోచించ సాగాడు.

రామయ్యకు పెళ్ళయింది. అతడి భార్య చక్కని చుక్క. అతడి ఆనందానికి అదే కారణమనుకుని, భీమయ్య ఊరూరా గాలించి, అందచందాల్లో రామయ్య భార్యను మించిన పిల్లను ఎంచుకుని పెళ్ళిచేసుకున్నాడు. అయినప్పటికీ, భీమయ్య సంతోషం రామయ్య సంతోషాన్ని కొంచెం కూడా మించలేదు.

భీమయ్య తన ప్రయత్నాలు మానలేదు. రామయ్య రెండంతస్థుల మేడ కడితే, తను మూడంతస్థుల మేడ కట్టాడు. రామయ్య రోజూ పదిమందికి అన్నదానంచేస్తే తను ఇరవైమందికి అన్నదానం చేశాడు. అలా అనుక్షణం రామయ్యతో పోటీపడుతూనే వున్నా, భీమయ్య సంతోషం మాత్రం రామయ్య సంతోషంతో ఏమాత్రం పోటీ పడలేక పోయింది.

రామయ్య సంతోషానికి కారణం ఏమిటా అని భీమయ్య ఎప్పుడుచూసినా, ఆయన చర్యలను గమనిస్తూ ఉండేవాడు. ఆయన ఏపని చేసినా దానికి రెండింతలుగా తాను చేసేవాడు. అయినా ప్రయోజనం లేక విచారంగా ఉండేవాడు.

ఇలా వుండగా–ఆ ఊరుకు ఒక సాధువు వచ్చాడు. రామయ్య ఆయనను తన ఇంటికి



ఆహ్వానించి భక్తిశ్రద్ధలతో సకల మర్యాదలూ చేశాడు.

ఆయన వినయవిధేయతలకు సాధువు ఎంతో సంతోషించి, "నీకేం కావాలో కోరుకో, నాయనా!" అన్నాడు.

అందుకు రామయ్య, "స్వామీ! నా భార్య గుణవతి. నా పిల్లలు బుద్ధిమంతులు. నాకున్నదానితో నాకు రోజులు హాయిగా గడవడమేకాక, మరి కొందరికి ఎంతో కొంత సాయపడగలుగుతున్నాను. అనారోగ్యం మా కుటుంబం దరికి రాదు. ఈ అదృష్టం మాకు కలకాలం నిలిస్తేచాలు! ఆ విధంగా జరగాలని అనుగ్రహించండి!" అన్నాడు రామయ్య.

"నీ సంతృప్తి మెచ్చుకోతగ్గది. భగవంతుడు నిన్ను తప్పక అనుగ్రహిస్తాడు!"అని సాధువు రామయ్యను మనసారా ఆశీర్వదించాడు.

తర్వాత సాధువు, భీమయ్య ఇంటికి వెళ్ళాడు. భీమయ్య, ఆయనను గౌరవంతో ఆహ్వానించి రామయ్యకంటే రెట్టింపు ఘనంగా సత్కరించాడు.

సాధువు సంతోషించి ఏం కావాలో కోరుకోమన్నాడు.

"నా పొరుగునవున్న రామయ్య ఎందులోనూ నన్ను మించకుండా వుండేలా, అనుగ్రహించండి స్వామీ!"అన్నాడు భీమయ్య వెంటనే.

సాధువు ఆశ్చర్యపడి, "నీవు నీకోసం ఏమైనా కోరుకో. ఫరవాలేదు. ఇతరుల ప్రస్తావన తేవడం అధర్మం!" అంటూ భీమయ్యను హెచ్చరించాడు.

"స్వామీ! నా సంతోషం రామయ్యను మించడంలోనే వున్నది. మీకు చేతనైతే అనుగ్రహించండి. లేకుంటే నా అదృష్టం ఇంతేనని సరిపెట్టుకుంటాను," అన్నాడు భీమయ్య.

సాధువు ఒక క్షణం కళ్ళు మూసుకొని ఆలోచించి, "నీ కోరిక తప్పక తీరుతుంది. అయితే, అందుకు రామయ్య అనుమతించాలి," అన్నాడు.

భీమయ్య చిన్నబుచ్చుకుని, "మీకు ఇష్టం లేకపోతే ఇష్టం లేదని చెప్పండి. అంతే కానీ నేను తనను మించడానికి రామయ్య అనుమతి లభిస్తుందనుకో వద్దు," అన్నాడు.

'వెర్రివాడా! అనుమతిస్తే నీవు రామయ్య కంటే వైభవంగా వుంటావు. అనుమతించక పోతే, రామయ్య తక్కువగా వుంటాడు. ఈ విషయం రామయ్యకు తెలియదుకాబట్టి - రెండువిధాలా నీకే లాభం. నా మాట విని వెంటనే అతడికి కబురు పంపించు," అన్నాడు సాధువు.

భీమయ్య, రామయ్యకు కబురు పంపాడు. రామయ్య వస్తూనే భీమయ్య కోరిక తెలుసుకుని, వెంటనే తన అంగీకారం తెలిపాడు.

సాధువు ఆశ్చర్యపడి, "నాయనా! ఎవరైనా ఇతరులకంటే గొప్పగా వుండాలనుకుంటారు. భీమయ్య నీ కంటే గొప్పగా వుండడానికి అంగీకరించడంలో నీ ఉద్దేశమేమిటి?" అని అడిగాడు.

"మహాత్ములు, తమకు తెలియనిదేముంది! ఇరుగుపొరుగులు మనకంటే తక్కువగా వుంటే, వారిలో మనపట్ల అసూయా ద్వేషాలు రేగి మనను బాధిస్తాయి. వారు మనకంటే గొప్పగావుంటే, మనను పట్టించుకోరు; లేదా మనపై జాలితో సాయపడతారు. అదీకాక, మన ప్రగతికి మాత్రమే సంతోషపడితే, కేవలం అప్పుడప్పుడుమాత్రమే సంతోషపడగలం. ఇతరుల ప్రగతి చూసి సంతోషించే వారికి నిత్య సంతోషం! ఎందువల్లనంటే, ఎప్పుడూ ఎవరో ఒకరు ప్రగతిని సాధిస్తూంటారుగదా!" అన్నాడు రామయ్య.

ఆ మాటలతో భీమయ్యకు రామయ్య సంతోషంలోని రహస్యం తెలిసిపోయింది. ఇది చెప్పడానికే సాధువీ ఏర్పాటుచేశాడని అర్థం చేసుకుని, అతడారోజు నుంచీ తన కంటే ఎక్కువగా ఇతరుల ప్రగతికి సంతోషిస్తూ నిత్యసంతోషి అయ్యాడు.



# కనకయ్య కలల పండెం!



చెన్నయ్య మంచి వంటవాడు. అద్భుతంగా వంటచేసేవాడు. వాడికి భార్యా, కుటుంబం అంటూ లేదు. వంటపని కోసం ఆ ఊరూ, ఈ ఊరూ తిరుగుతూ పొట్టపోసుకునేవాడు. కొన్నేళ్ళు ఇలా గడిచాక ఏదైనా ఒకచోట స్థిరపడాలనుకున్నాడు. ఒక ధనికుడి ఇంట వంటవాడిగా చేరాడు.

ఆ ఇంటి యజమాని కనకయ్య పరమ పిసినారి. పెళ్ళి చేసుకుని పిల్లల్నికంటే, తన ఆస్తిని పిల్లలకు పంచవలసి వస్తుందన్న భయంతో పెళ్ళికే స్వస్తిపలికిన పెద్దమనిషి!

ఆయనకూ ముసలితనం పైబడుతున్నది. వేళకు ఇంత వండిపెట్టడానికీ, బట్టలూ అవీ ఉతకడానికీ ఒక మనిషి కావలసి వచ్చాడు. అయితే, పెళ్ళయినవాణ్ణి పనిలోకి తీసుకుంటే వాడి భార్యాపిల్లలను పోషించవలసి వస్తుంది కదా! అందువల్ల ఏ బాదరబందీలేని సేవకుడి కోసం ఎదురు చూస్తున్న కనకయ్య, చెన్నయ్య వివరాలు తెలియగానే సంతోషంతో పొంగిపోయాడు. ఇంతకాలానికి తాను ఎదురు చూస్తూన్న వంట మనిషి దొరికాడని ఆనందంతో పనికి కుదుర్చు కున్నాడు. అయినా, తన కడుపుకు కూడా సరిగ్గా తినని తన యజమాని పిసినారితనం చూసి చెన్నయ్య బాధపడ్డాడు. ఆయనా తిన కుండా, తననూ తిననీయకుండా చీటికీ మాటికీ చీవాట్లుపెట్టే యజమానిని చూస్తే వాడికి జాలి కలిగేది.

* * *

దీపావళి పండుగ వచ్చింది. ఊరు ఊరంతా ఉత్సాహం ఉరకలు వేస్తోంది. ఇళ్ళన్నిటినీ శుభ్ర పరచి అలంకరించారు. ఘుమఘుమలాడే పిండివంటలు చేసుకుంటున్నారు. ఇరుగు పొరుగును చూసి చెన్నయ్యకూడా దీపావళికి చేసే పిండి వంటలు చేశాడు. అయితే ఆ సంగతి వాడి యజమానికి తెలియదు. పండుగకదా యజమాని తనను ఏమీ అనడన్న నమ్మకంతో ఆయన్ను అడగకుండానే అన్ని వంటలూ తయారుచేశాడు.

భోజనానికి కూర్చున్న యజమానికి ఎదురుగా ఉన్న వంటలను చూడగానే ఒక్కసారిగా కళ్ళు చెదిరి, కడుపు తరుక్కుపోయింది. ''ఏమిటి చెన్నయ్యా, ఈ వంటలు! కొంపతీసి నెలకు సరిపడా ఈ రోజే వండేశావా ఏమిటి?'' అని అడిగాడు పళ్ళు పటపటలాడిస్తూ, కోపం బాధ మిళితమైన కంఠ స్వరంతో.

'' ఈరోజు దీపావళి కద బాబూ! కనీసం సంవత్సరానికి ఒక్క పండుగరోజైనా తమరు కడుపునిండా రుచికరమైన భోజనం చెయ్యాలని

ఇన్ని వంటలు చేశాను,'' అన్నాడు చెన్నయ్య చేతులు మెల్లగా జోడించి.

''అవునవును. పండుగకదా! ఆమాట మరిచాను,'' అన్నాడు కనకయ్య. తాను గట్టిగా మందలిస్తే వాడు తనను అసహ్యించుకుని వెళ్ళిపోవచ్చు. అప్పుడు తనకే సమస్య కదా? అని గ్రహించి కాస్త శాంతం నటించాడు కనకయ్య. వీడు చేసిన వంటకాలకేమో చాలా డబ్బు ఖర్చయిపోయింది. ఎంత మొత్తుకున్నా అది తిరిగి రాదు. ఇప్పుడు చేయగలిగిందల్లా ఆ వంటకాలన్నిటినీ తానొక్కడే తినేయడం! వీణ్ణెందుకు తిననివ్వాలి? అని తీవ్రంగా ఆలోచిస్తూ తినడం ప్రారంభించాడు. వంటలు చాలా రుచిగానే ఉన్నాయి. పీకల దాకా తిని బ్రేవ్‌మని త్రేన్చాడు. కడుపు పెద్ద బానలా తయారయింది. వండిన వంటలన్నిటినీ తినేశాడుగానీ, ఎంత ప్రయత్నించినా జిలేబీలను మాత్రం ముట్టుకోలేకపోయాడు. అయినా, వాటిని కూడా చెన్నయ్యను తిననివ్వకూడదన్న దృఢసంకల్పంతో ఒక పథకం ఆలోచించాడు. ''చెన్నయ్యా! జిలేబీలను చేసిన వెంటనే తినకూడదు. కొన్ని గంటల తరవాత తింటేనే రుచిగా ఉంటాయి. కాబట్టి వీటిని తీసుకెళ్ళి భద్రంగా దాచిపెట్టు. సాయంకాలం తింటాను,'' అన్నాడు.



చెన్నయ్య అలాగే చేశాడు. సాయంకాలమయింది. అయినా, కనకయ్యకు ఏమాత్రం ఆకలి కాలేదు. అయినా జిలేబీలన్నిటినీ తనే తినాలనుకున్నాడు. అందువల్ల చెన్నయ్యను కేకవేసి పిలిచి, ''ఇవాళ పండుగ కదా! సరదాగా ఒక పందెం వేసుకుందాం. అప్పుడే పండుగ శోభిస్తుంది. ఇద్దరం ఇప్పుడే వెళ్ళి పడుకుందాం. ఆసక్తికరమైన కలలు కనడానికి ప్రయత్నిద్దాం. పొద్దున లేవగానే మన ఇద్దరిలో ఉత్తమమైన కలను వివరించేవారికే జిలేబీలు! ఏమంటావు?'' అని అడిగాడు. యజమాని మాటకదా! చెన్నయ్య ఎలా కాదనగలడు? ''అలాగేబాబూ!'' అన్నాడు.

కనకయ్య సంతోషంగా వెళ్ళి పడుకున్నాడు. ''తెల్లవారేసరికి ఆకలి అందుకుంటుంది! జిలేబీలన్నిటినీ నేనే తినేస్తాను! నేను చెప్పేదే అద్భుతమైన కల, అని బుకాయిస్తాను. నా మాటకు ఎదురాడలేడు కదా ఈ మందమతి వెధవ!'' అనుకుంటూ నిద్రలోకి జారుకున్నాడు.

కొంతసేపటికల్లా కనకయ్య ఆనందంగా గురకపెట్టడం చెన్నయ్య విన్నాడు. వాడి కడుపు ఆకలితో నకనకలాడుతోంది. మెల్లగా అడుగు మీద అడుగువేసుకుంటూ వంటగదిలోకి వెళ్ళాడు. పాత్ర మూత తీసి జిలేబీలు ఒక్కొక్కటిగా తినసాగాడు. పొద్దుట్నుంచి వాడేమీ తినలేదు. వాడు వండిన వంటలన్నీ యజమాని బకాసురుడిలా తినేయడం వల్ల వాడికేమీ మిగలలేదు. ఇప్పుడేమో ఒక్క జిలేబీకూడా మిగల్చకుండా అంతా తినేసి వెళ్ళి గుట్టు చప్పుడు కాకుండా పడుకున్నాడు.

* * *

కనకయ్య తెల్లవారగానే నిద్ర లేచి, ''చెన్నయ్యా! నీకు రాత్రి ఎలాంటి కల వచ్చిందేమిటి?'' అని అడిగాడు ఆదుర్దాగా.

''భయంకరమైన కల బాబూ!'' అన్నాడు చెన్నయ్య చేతులు జోడిస్తూ.

''నాకెలాంటి కలవచ్చిందో తెలుసా? మహా అద్భుతమైన కల! ఏనుగు మాల వేయడంతో నేనొక అందాల రాజకుమారిని వివాహమాడి, ఆమె రాజ్యానికి రాజునయ్యాను. పట్టాభిషేక ఉత్సవం పూర్తయ్యాక నేనూ, రాణీ దర్బారులో కొలువుదీరాము. మంత్రులూ, సామంతులూ, సేనానాయకులూ,పండితులూ, ప్రముఖులూ, రాజోద్యోగులూ జేజేలు పలికారు. అప్సరసలను తలదన్నే నర్తకీమణుల అద్భుత నాట్యాన్ని

తిలకించాము. రాజ్యంలోనే పేరుగాంచిన గాయనీగాయకుల అద్భుత గానాన్ని రోజంతా వీనులవిందుగా ఆలకించాము. అదొక అద్భుత అనుభవం! అది సరే, నీకు ఎలాంటి కలవచ్చిందో ఇంకా నువ్వు చెప్పనేలేదే!'' అన్నాడు కనకయ్య.

"అదేం చెప్పమంటారు బాబూ! అటు కళ్ళు మూశానో లేదో తెలియదు. కాళికాదేవి కళ్ళురుముతూ నా ముందుకు ఉరికి, 'అప్రాచ్యుడా! సంతోషంగా గడపవలసిన ఈ పండుగపూట పొద్దుట్నుంచీ ఏమీ తినకుండా పస్తుతో పడుకున్నావా? ఇప్పుడే వెళ్ళి వంటగదిలో ఉన్న జిలేబీలన్నిటినీ తినేస్తావా? లేక గొంతు నులిమి చంపేయమన్నావా?' అని హుంకరించింది బాబూ. నేను భయంతో వణికిపోతూ, 'తల్లీ ఆ పని మాత్రం చేయలేను. నేనూ, నా యజమానీ ఒక పందెం వేసుకున్నాం. ఆ పందెం ప్రకారం—బ్రహ్మాండమైన కలకన్నవారే వాటిని తినాలి. అదీ తెల్లవారాకే సాధ్యం. కాబట్టి దయతలచి నన్ను బలవంతపెట్టవద్దు. నా యజమానికి ఇచ్చిన మాటను తప్పలేను,'' అని చెప్పాను. అయితే ఆమె నా మాట వినిపించుకోలేదు. 'నా మాటకు ఎదురాడకు! వెళ్ళి జిలేబీలు తిను! నా ఆజ్ఞను తిరస్కరించావో ఇప్పుడే హతమారుస్తాను,' అంటూ త్రిశూలాన్ని పైకెత్తింది బాబూ. పండుగ పూట ప్రాణాలు కోల్పోవడం ఇష్టంలేక జిలేబీలను తినవలసి వచ్చింది!'' అన్నాడు దీనంగా ముఖం పెట్టి చెన్నయ్య.

ఇంతపెద్దకథ విని విసిగిపోయిన కనకయ్య, "నాకు ఎలాంటి చప్పుడూ వినిపించలేదే! పక్క గదిలోనే కదా నిద్రపోతున్నాను. నువ్వు పిలిచి ఉంటే నీ రక్షణకు వచ్చి ఉండేవాణ్ణి కదా? కలలో ఎవరో బెదిరించారని జిలేబీలన్నీ తినేశావే!'' అన్నాడు బాధగా.

"తమ సహాయం తీసుకోవాలనే అనుకున్నాను, బాబూ! అయితే మీరు రాజ దర్బారులో సింహాసనంమీద రాణిగారి పక్కన కూర్చుని నర్తకీమణుల నాట్యాన్ని తిలకిస్తున్నారు



మరి! మీ చుట్టూ, మంత్రులూ, అంగరక్షకులూ, భటులూ చెప్పలేనంత మంది! అయినా, ధైర్యంచేసి మీ ఎదుటికి చొచ్చుకు రావడానికే ప్రయత్నించి ముందుకు అడుగు వేశాను. వెంటనే ఇద్దరు భటులు నా రెక్కపట్టి ఇవతలికి లాగి వెనక్కు తోసేశారు. వాళ్ళు నన్ను తమ దరిదాపులకు రానిస్తే ఒట్టు!'' అన్నాడు చెన్నయ్య చెప్పలేని నిస్సహాయతను కనబరుస్తూ.

కనకయ్య నోట మాటరాలేదు. కొంతసేపు మౌనంగా ఉండిపోయాడు. తన ఎత్తుకు పైఎత్తు వేసిన చెన్నయ్య తెలివిని మనసులోనే మెచ్చుకున్నాడు. తన నీడలో బతుకుతూన్న వాణ్ణి మోసం చేయాలన్న తన మూర్ఖపుటాలోచనకు సిగ్గుపడ్డాడు. తెలివైనవాడూ, నమ్మకస్థుడూ అయిన చెన్నయ్యను వదులుకోవడానికి ఆయనకు మనసొప్పలేదు. అయినా, కూర్చుని తిన్నా తరగని ఆస్తి తనకున్నది. ఎందుకీ పిసినారితనం అని బాధతో ఆలోచించాడు. ఆ రోజు నుంచి తానూ కడుపునిండా తింటూ, చెన్నయ్యకూ ఇంత పెడుతూ సుఖంగా కాలం గడిపాడు.



ఇదొక చందమామ కానుక!
10
అజేయుడు గరుడుడు
చిత్రాలు: పాణి
తండ్రి ఆదేశం ప్రకారం ఆదిత్యుడు గరుడభగవానుణ్ణి పూజించాడు. పూజామందిరమంతా వింత వెలుగుతో నిండిపోయింది. విగ్రహం పాదాలవద్ద ఉన్న ఈక గాలిలో సుడులు తిరుగుతూ పెద్దదికాసాగింది. ఆదిత్యుడి శరీరంలో మార్పులు వచ్చాయి. ఆ మార్పులు ఆదిత్యుడికి మాత్రమే కనిపిస్తాయనీ, అతడికి దివ్యశక్తులు సంక్రమించాయనీ, దివ్యవాక్కు వినిపించింది. గరుడుడిలాగా వేషాలు ధరించిన పలువురు మళ్ళీ రాజ్యంలో అల్లకల్లోలం సృష్టించసాగారు. అందరూ పట్టుబడ్డారు. తెల్లవారగానే అం ఉరిశిక్ష విధించమని రాజు ఆజ్ఞాపించాడు. దానిని విని సేనాధిపతీ, అతడి కొడుకూ హడలిపోయారు.




"నా పథకం నెరవేరిందంటే చంద్రపురి రాజ్యం తలరాతనే మార్చివేయగలను!"
"నువ్వు ఆదిత్యుణ్ణి అదుపులోకి తీసుకున్నావా?"
"ప్రధానమంత్రి, తన నివాసంలో కనిపించడంలేదు."




"రేపు ఉరిశిక్ష విధించనున్న వాళ్ళందరినీ వదిలివేశాం."
"రాజభవనంలోని కాపలాభటులను తొలగించి వాళ్ళస్థానంలో మనవాళ్ళను నియమించు. రాజును అపహరించి...
నేలమాళిగలోని రహస్య కారాగారంలో బంధించు. రాజును గరుడుడు అపహరించుకు పోయాడని ప్రచారం చేయించు."
"చిత్తం, ప్రభూ.."


"గరుడుడు పట్టుబడితేనే..."
అవును రవీంద్రా! త్వరలో పట్టుబడతాడు. వాణ్ణి తప్పక పట్టి బంధించే తీరుతాం!"


రాజభవనంలో లభించిన ఒక లేఖ గురించి భటుడొకడు నరేంద్రదేవుడికి చెప్పాడు.
"లేఖా? ఏమై ఉంటుంది? ఎవరు పంపారు?"
నేను రాజుగారి శత్రువునుకాను, మిత్రుణ్ణి! రాజుగారినీ, ప్రధాన మంత్రినీ, వారి భద్రతకోసం సురక్షిత ప్రదేశానికి నేనే అపహరించుకు


పోతున్నాను... మంచికీ చెడుకూ మధ్య యుద్ధం ఇకమీదటే ఆరంభమవుతుంది.
దుష్టులకు ఇదే నా హెచ్చరిక! - గరుడుడు!
"గరుడుడు! గరుడుడు! ఎవరక్కడ? వెళ్ళండి! రాజూ, ప్రధానమంత్రీ ఎక్కడున్నారో వెతికి హతమార్చండి. ఇదే నా ఆజ్ఞ!"


"గరుడుడి ఆచూకీ తెలియజేస్తే గొప్ప బహుమతులు ఇస్తారట. నేనూ ఒక కన్నువేసి ఉంచుతాను."
రాజూ, ప్రధానమంత్రీ కనిపించకపోవడంవల్ల, అధికార బాధ్యతలను రవీంద్రదేవుడు చేపట్టినట్టు చాటింపు జరిగింది. అక్కడక్కడ ప్రకటనలు వెలువడ్డాయి.

రాజుగారి వాహనం అడవిలో కొండల గుండా వెళుతోంది.

"మహాప్రభూ!
ప్రజలను హింసిస్తున్న
వాళ్ళందరూ సేనాధిపతి
అనుచరులే...

...గరుడుడిలా వేషాలు
ధరించి,
నానా విధాలుగా

...ప్రజలను వేధిస్తున్నారు.

ప్రజలను చుపుతున్నారు.

ఇళ్ళకు నిప్పు పెడుతున్నారు.

రకరకాల రాక్షసకృత్యాలకూ
పాల్పడుతున్నారు.


విశ్వాసపాత్రులైన అంగరక్షకులనూ, కాపలాభటులనూ తొలగించి, వాళ్ళస్థానంలో తన అనుచరులను నియమించి రాజుగారిని అపహరించుకు పోవాలని నరేంద్రదేవుడు పథకంవేయడం గురించి నాకు తెలియవచ్చింది.


తమ ప్రాణాలకు ఎలాంటి ఆపదా రాకూడదనే, ఇక్కడికి ఇలా తీసుకువచ్చాను. వీరబాహువే రథాన్ని నడుపుతున్నాడు. నేను తమరిని ఇలా తీసుకువచ్చిన సంగతి రాజభవనంలో మరెవ్వరికీ తెలియదు.


"జలపాతానికి వెనక ఉన్న గుహ చాలా సురక్షితమైనది."
"సరే! నువ్వు నాతో ఇక్కడే ఉంటావుకదా? వదిలి వెళ్ళవుకదా?"
"పరిస్థితులు ఎలా ఉన్నాయో చూడడానికి నేను రాజధానికి తిరిగివెళ్ళాలి. కంటికి రెప్పలా మీ రక్షణాబాధ్యతలు వీరబాహు చూసుకుంటాడు."


వీరబాహు అప్పుడే అటుకేసి వచ్చాడు.
"అరుణకూడా ఇక్కడే ఉంది."
"రండి. రాజుగారిని కలుసుకుందాం!"


"మహాప్రభూ! ఈయనే వీరబాహు. అరుణ నా తండ్రివద్ద ఆయుర్వేదం నేర్చుకునేది. ఇప్పుడామె మీ అవసరాలు చూసుకుంటుంది."


ఆదిత్యుడు మారువేషంలో రాజధానిని చేరుకున్నాడు.
"మన ప్రధానమంత్రి మహావీరుడు! ఆయన కూడా కనిపించడంలేదంటే నమ్మశక్యం కావడంలేదు! బాధగా ఉంది."
"ఏమి నటన! నయవంచన! అతనికి తగిన గుణపాఠం నేర్పాలి!"
— (ఇంకావుంది)



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ







ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 20వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు జనవరి 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.

## అభినందనలు

సెప్టెంబర్ 2001 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

బొడ్డపాటి రాజేశ్వరమూర్తి
20/564-డి, ఫ్రెంచి తోట
మచిలీపట్నం-521 001 (ఆం.ప్ర)



బహుమతి పొందిన వ్యాఖ్యలు



మొదటి ఫోటో : ఒంటరిగా ఇచ్చట!
రెండవ ఫోటో : నలుగురితో ముచ్చట!!




Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam